శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# ర సి క జ న మ నో భి రా మ ము.



క వి సా ర్వ భౌ మ

కూచిమంచి - తిమ్మకవిప్రణీతము.

బ్రహ్మశ్రీ

శతావధాని పురాణం, సూర్యనారాయణతీర్థులవారిచే

పరిష్కృతము.




వా వి ళ్ల, రా మ స్వా మి శా స్త్రు లు

అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

---

Madras:

INDIA STEAM PRINTING WORKS.

Rs. 0-8-0] 1910. 

శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# రసికజనమనోభిరామము.

## పీఠిక.

శ్రీమీఱం దనపెండ్లివేళ నొడలం • జెన్నారుభూషామణి
స్తోమంబుం బొడగాంచి శైలసుత చే•తోవీధిఁ గంపింపఁ ద
ద్భామారత్నము కొప్పు బర్హ మని యా•పాము ల్దల ల్వంప న
త్యామోదంబున నవ్వు శంభుఁ డిడు మా • కత్యంతసౌఖ్యోన్నతుల్. 1

సీ. చిన్నారిజాబిల్లి • సేసక్రొవ్వెదపువ్వు, మెట్టరాచబిడారు • పుట్టినిల్లు
మగనిసామేను సే•మపుటోలగపుమిద్దె, కలుములజవరాలు • చెలిమిబోటి
తెలిగంటికల్కి ము•ద్దియ లాడిగపుఁజెలుల్, కడిఁదిబొబ్బమెకంబు • కత్తలాని
యాముటేనుఁగుమోము • సామిముగులపట్టి, జక్కఁగవిరిబోఁడి • సవతిమిన్న
తే. గాఁగ జగములు గడితంపుఁ•గని రంపు, పెంపు రాణింప నెపుడుఁ బా•లింపుచుండు
సర్వమంగళ మాకు న•ఖర్వసర్వ, మంగళావాప్తి నొడఁగూర్చి • మనుచుఁ గాత. 2

చ. పొలుపుగ గొల్లక్రొందలిరుఁ•బోఁడులకుల్కుమిటారిగబ్బిగు
బ్బలు జలువెన్నముద్ద లని • భావమునం దలపోసి డాసి కం
చెల వెడలించి మాటికిని • జేతుల నొక్కుచు హొంతకారి యై
యలఁతిగ నవ్వు వెన్నుఁడు ద•యామతి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్. 3

మ. దివిషద్రాజముఖీలలామఫలకో•త్తీర్ణస్ఫురత్కుంకుమ
ద్రవలాక్షారుణితాంఘ్రిపద్మ యగుచు • న్రాణించునప్పద్మభూ
భువనోత్కృష్టమహాప్రబంధఘటనా•పూర్ణైకసామ్రాజ్యవై
భవ మెల్లప్పుడు మా కొసం యనుకం•పాలీలలం బ్రోవుతన్. 4

మ. నలుమోము ల్దన కబ్బియుండుటకు నా•నందంబుతో నోలిమైఁ
బలుకుందొయ్యలిచెక్కులం బెదవియుక్ • ఫాలంబుఁ జుంబించి చే

తులవెంట న్వలిగబ్బిగుబ్బచనుబం•తు ల్వట్టి క్రీడాకళా
కలన న్మించువిరించి మా కొసఁగు సా•కల్యాయురారోగ్యముల్. 5

సీ. అమరశిరఃకిరీ•టాంచలమణివిభా, నీరాజితాంఘ్రి యే•సారసాక్షి
కుందేందుమందార•చందనఘనసార, నీహారవర్ణ యే•మోహనాంగి
హేమాబ్జకబళనో•ద్దామమత్తమరాళ, ఘోటకారోహ యే•బోటిమిన్న
వరదండపుస్తక•వల్లకీకరరాజ, రాజత్కరాబ్జ యే•రాజవదన

తే. యమ్మహావాణి పికవాణి • యజునిరాణి, సైకతశ్రోణి మదచంచ•రీకవేణి
పరమకల్యాణి కిసలయ•పాణి మాకు, మంజువాగ్వైభవ లొసంగి • మనుచుఁ గాత. 6

మ. ప్రమథాధీశశిరోగ్రభాగవిలస•త్ప్రాలేయరుక్ఖండ ముం
దం బొప్పంగఁ జూచి మోదకముగా • భావించి యంచత్కరా
గ్రము వే చాఁచి కడంకతోడఁ దివియం • గామించి మే లెంచుదం
తిముఖుం డెప్పుడుఁ బ్రోచు మత్కృతి దయా•ర్ద్రీభూతచిత్తంబునన్. 7

మ. చిరభక్తిప్రతిభావిభాసితుఁడనై • చింతింతు నశ్రాంతముం
బరవాదిప్రమదద్విపేంద్రపటలీ•పంచాననశ్రేష్ఠు బం
ధురతేజోనిధి దెందులూరికులపా•థోరాశిరాకానిశా
కరుని న్లింగయసద్గురూత్తముని సా•క్షాచ్చంద్రచూడాకృతిన్. 8

సీ. గురుతరకౌండిన్య•గోత్రవిఖ్యాతుండు, బయ్యనామాత్యుఁ డే•ప్రభుని తాత
నిరతాన్నదానవ•ర్ణితయశస్సాంద్రుండు, తిమ్మనసచివుఁ డే•ధీరుతండ్రి
ఘనులు జగ్గనయు సిం•గనయును మంత్రియు నర, సనయును నేధన్యు•ననుజవరులు
తిమ్మయాఖ్యుఁడు నేఁ బ్ర•థితులు సింగనయు జగ్గనయు సూరనయు నే•యనఘుసుతుల

తే. మతులమతి రాజమాంబ యే•యధిపుజనని, యతిపతివ్రత లక్ష్మి యే•చతురురాణి
యట్టి శ్రీకూచిమంచివం•శాబ్ధిచంద్రు, మజ్జనకు గంగనామాత్యు • మదిఁ దలంతు. 9

మ. తనరార న్నుతి సేతు సేతుహిమవ• ంగాస్తశైలాంతరా
వనిభాగావిరతప్రసి కవివి•ద్వన్మాగ ద్రాదియా
చనకానీకనిరంతర ణుతభా•స్వద్దానవిద్యాపరా
యణు భూభ జ్జనపూజ్యు మజ్జనకు గం•గామాత్యచూడామణిన్. 10

చ. మనమునఁ బ్రస్తుతింతు బుధ•మాను ల ధన్యుల జగ్గనార్యసిం
గనసరసప్రభా ది•తాఖు ల మ ( కులేంద్రముఖ్యులన్
ధనదసఖాం క్తిసము• ంచి చిత్తుల సాధువృత్తులన్

జనవినుతాన్నదానగుణ•సంతతభవ్యుల మత్పితృవ్యులన్. 11

మ. కవిచూడామణుల న్మహోఘనుల వే•డ్కం గొల్తు వల్మీకసం
భవు వ్యాసు జ్జయదేవు భోజనృపతి • న్బాణు న్మయూరాహ్వయున్
శివభద్రాఖ్యుని గాళిదాససుకవిన్ • శ్రీహర్షుని న్మాఘు భా
రవిఁ జోరు న్భవభూతి మల్హణుని వా•క్ప్రాచుర్యసంసిద్ధికిన్. 12

సీ. బహుముఖవక్తయై • పరఁగుకుండలినాథు, నఖిలకళాధాముఁ • డైనసోముఁ
బరజయోన్నతి నెన్నఁ•బడువీరభద్రుని, సర్వజ్ఞతాగుణ•శాలి భీముఁ
జతురాస్యు వాగను•శాసను విబుధప్ర, కరముఖ్యు నమరేశుఁ • బురుసుసింహుఁ
డనఁ దగు శ్రీనాథు • ఘనమార్గకర్తయై, కరము వెలుంగుభా•స్కరబుధేంద్రు
తే. సతతలోకేశ్వరప్రపూ•జితనితాంత, రాజమానప్రభావుని • రంగనాథు
మఱియు నాంధ్రకవిత్వని•ర్మాణకుశలు, లగుమహాకవివర్యుల • నభినుతింతు. 13

తే. భంగమున దాఁగి పంకంబు•పాల లోఁగి
సరసులకుఁ గాక యెఱుకలు • సడల నెఱసు
లేఱుచు జడాశయంబుల • నెపుడు మెలఁగు
కుకవినికురుంబముల లెక్కఁ • గొనఁగ నేల. 14

సీ. అన్యపదాగాప•హరణప్రవీణులు, సమధికసుశ్లోక•విముఖమతులు
గురువల సువర్ణ•పరిశోధనాజ్ఞులు, సదమలసాధుల•క్షణరహితులు
చిరతఘనసుఖ•శ్రేయోవిదూరులు, ప్రతిపదాత్యంతకు•వాదగతులు
సంతతసమధిక•సమతప్రకంపితు, లతితరదుర్వృత్త•యుతులు నైన
తే. ధూర్తకవిరాజుల కొంకింతఁ • దొలఁగ వలయు, నఖిలదిగ్దేశనృపసభా•ఖ్యాతపూత
భారతీలబ్ధకవితావి•భాసమాన, సారసామ్రాజ్యఖని యైన•సజ్జనుండు. 15

సీ. బహుపురాణములు ప్ర•బంధము ల్లక్షణ, శాస్త్రము ల్వివిధకో•శములు నాట
కము లలంకారశా•స్త్రములును శోధించి, ప్రౌఢిమై నేతత్ప్ర•బంధ మే నొ
నర్చెద నిందులో•న నొకించుకొక్కెడఁ, బరికింప నెఱసులు • దొరలి యున్న
నెన్నిక సేయక • హితకరుణామతిఁ, గనఁగొని సారంబె • కైకొనుండు
తే. మంచితేనియ జనులు వే•మఱు కడంక, నరసి వడపోసి యునిచిన• నందులోన
నలుసు లొకకొన్ని యందందఁ•గలుగకున్నె, భవ్యమతులార కవిబుధ•ప్రవరులార.

సీ. వళులయొప్పిదమున • వఱలునాశయమ్మదు, పదవిభ్రమంబుల • బాగు మీఱి
కలితచంపకమాలి•కాసుకాంతిశ్రీల, సరసిజముఖవికా•సములఁ దనరి

మహితచమత్కృతియా మధురవాగ్రచనల, శుభలక్షణారూఢి సొంపెసంగి
ప్రవిమలశృంగారభావగౌరవమునఁ, గన దలంకారవైఖరులఁ జెలఁగి

తే. ప్రబలు నుత్కృష్టకన్యకారత్న మఖిల, రసికజనసంతతమనోభిరాము మగుచు
నిండుకొనుశీవి నిద్ధరామండలమున, నసదృశవిలాసలీలల నలరుఁ గాత. 17

వ. అని నిఖిలదేవతాప్రణతియును గురుచరణస్మరణంబును బితృపితృవ్యస్తోత్రంబును బురాతనమహాకవివర్ణనంబును గుకవినిరాకరణంబును నాధునికసుకవివిద్వత్ప్రి నంబునుం గావించి యష్టాదశాధికవర్ణనాన్వితం బగు నొక్క మహాప్రబంధంబు నొనరఁ బూని యున్న సమయంబున. 18

సీ. పరిపరిశీలుకర్బురపురక్షణునుఁ డ, గ్రగశాపటీక జూహుగాణవ ప్త
పరవిపిండీవృషపదకదంబుఁడు మహా, కులకశయాలీనగురుకలాపుఁ
డద్రిదారకసముద్యద్విస్మయవిదారి, నాగప్రహాధసమున్నతతురంబుఁ
డవిరలచంద్రమయాగాగగానుఁడు, రీతకృపానాగతప్రియసచివుఁడు

తే. భద్రఖింఛోళుఁ డాశ్రితశూద్రధరుఁడు
నిగమగధా మృగుఁడు క్షితినిగమకులుఁడు
పత్ప్రిహారే న్మాహ్వాయప్రభుఁడు నాదు
స్వప్నమున నొక్కనాఁడు సాక్షాత్కరించె. 19

తే. అటు సాక్షాత్కరించి మహాత్ముఁ డైన
పి పురీకుక్కుటేశ్వరాభిఖ్యసాంబ
శివుఁడు నిస్తులకరుణార్ద్రచిత్తుఁ డగుచు
నింపు దళుకొత్త ననుఁ జూచి యిట్టు లనియె. 20

సీ. ప్రతిభమై రుక్మిణీపరిణయంబును సింహ, శైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కథయును రాజశేఖరవిలాసంబును, నచ్చతెనుంగురామాయణంబు
సారంగధరనృపచరితంబు సాగర, సంగమాహాత్మ్యంబు రంగుమీఱు
సకలలక్షణసారసంగ్రహంబు నొనర్చి, కృతులు మాపేర నంకితము చేసి

తే. నట్టిప్రోడవు నీ విపు డలఘుమతిని, రహి నొనర్పఁగఁ బూనినరసికజనమ
నోభిరామముఁ గృతిసేయు మలర మాకుఁ, దిమ్మకవిరాయ సకలసుధీవిధేయ.

క. నరవరు లిడుమణిభూషా, కరితురగాందోళికాదిఘనవిభవము ల
రము లవేటికి ని కే, నిరవుగ నిహపరసుఖంబు లిడియెదఁ జుమ్మీ. 22

వ. ని యాన తిచ్చి యప్పరమే రుం డంతర్హితుం డగుటయు నేను నమందానందకం

దళితహృదయారవిందుండ నై యమ్మహాదేవునకు నిమ్మహాప్రబంధంబుఁ గృతిసేయ నిశ్చయించి. 23

సీ. నిఖిలవిద్యాభ్యాసనిపుణుండు మత్సహోదరుఁ డగుజ సత్కవితనయులు
ఘనులు తిమ్మనయు సింగనయును లేఖక, పాఠకులై ప్రతుల్ ప్రబలఁ జేయఁ
జేర్మిఁ గాంచినవాఁడఁ బీరపుప్రాజ్య, రాజ్యాధిపత్యవిభ్రాజమాన
భూరివైభవుఁడు నద్భుతపరాక్రముఁడును, దానకళాధురంధరుఁడు నైన

తే. రావునీలాద్రిమాధవరాయనృపతి, చేతఁ గవిసార్వభౌమవిఖ్యాతబిరుద
మందినఘనుండఁ దిమ్మయాహ్వయుఁడ నేను, విమలతరభక్తి మదిలోన విస్తరిల్ల.

## షష్ఠ్యంతములు.

క. శ్రీదునకు సకలముదిత, శ్రీదునకు నితాంతభృంగిరిటిపటునటనా
మోదునకు నిగమసంస్తుత, పాదునకు హృతాఖిలాఘభవఖేదునకున్. 25

క. భర్గునకు దళితపురభట, వర్గునకుఁ బ్రకీలితాపవర్గునకు లస
న్మార్గునకుఁ జిరకృపార్ద్ర, సర్గునకు నితాంతసుగుణసంసర్గునకున్. 26

క. శంభునకు జితగజాసుర, దంభునకు సమస్తబుధవితానావనసం
రంభునకు దానవిద్యా, రంభునకుఁ బ్రహృష్టమానిరాడ్డింభునకున్. 27

క. భీమునకు రజతభూధర, ధామునకు సుధాంశుకోటిధామునకు మహో
ద్దామునకు శ్రితజనావన, కామునకు హృతోగ్రపాతకస్తోమునకున్. 28

క. శర్వునకు సతతముదితసు, పర్వునకు సమస్తభువనపావనలీలా
ఖర్వునకు దళితదుర్జన, గర్వునకు మహోక్షరాజగంధర్వునకున్. 29

క. స్థాణునకు సతతపరిచిత, బాణునకు సరోరుహాక్షబాణునకు జగ
త్త్రాణునకు హృతకృతాంత, ప్రాణున కతిసత్యవాక్యపరిమాణునకున్. 30

క. భవునకు నిరుపమశుభవై, భవునకు సంఘటితసకలభువన కురుప్రా
భవునకుఁ గృతపరిపరిపరి, భవునకు భవునకు నిరస్తభా భవునకున్. 31

క. రంగజ్జటాగ్రవిలస, ద్గంగాప్రాలేయఘృణికి ఘనవితరణి కు
త్తుంగగుణమణికిఁ గుక్కుట, లింగప్రభుమణికిఁ గుండలీకృతఫణికిన్. 32

ఆ. అర్పణముగ నమ్మహాదేవుకృప నే న, నూనలీలఁ గూర్పఁ బూనినట్టి
రసికజనమనోభిరామం బనెడుకృతి, కిలఁ గథావిధాన మెట్టు లనిన. 33

## కథాప్రారంభము.

క. మును నారదమునివరునకు, మునుకొని పుణ్యేతిహాస • ములు నలువ దగన్
వినుపించు చుండి యొకకథ, యొనసినకృపఁ దెలుపఁ బూని • యి ట్లని పలికెన్.

శా. చంచత్కాంచనసౌధభాగలసిత • శ్యామాంశుభాంగప్రభా
భ్యంచద్విభ్రమచంచలాభ్రమకచా • భ్రభ్రాంతిలీలావల
త్కించిల్లాస్యకళావిలోలఫణిభు • క్కేకారవాకారిత మై
కాంచెన్ బేర్మిఁ బురోత్తమం బొక టిలం • గల్యాణనామంబునన్. 35

సీ. ప్రాకారములడంబు • పరిఘులచెలువంబు, వనములపెంపు జ•వ్వనులసొంపు
బావులఠీవి క•ప్రపుధూపములతావి, జగిలెలరంగు ర•చ్చలహొరంగు
గణికలయొప్పు బం•గరుమాడువులవిప్పు, గోపురంబులమించు • కోట్లసంచు
తేరులతీరు ము•త్తెపుఁబందిరులసౌరు, నగరులకల్మి యే•నుఁగులబల్మి
తే. కత్తలానులయేపు మే•ల్కట్లకోపు, మదురుగోడలమెఱపు వా•ల్మగలయొఱపు
తలుపుగమిపీలునిలువుటా•ద్దములమేలు, దనర వెలుఁగొందు నాప్రోలు • ధరణియందు.

మ. పరిఘాంతర్విలసద్భుజంగయువతుల్ • ప్రాకారశృంగాగ్రవి
స్ఫురదస్వప్నవధూమణీజనులకున్ • శుభ్రాభ్రపిండంబు లం
పి రస నీమ్రఁదికి నేగు నంచ లమరీ•బింబోష్ఠు లింద్రోపలో
త్కరము ల్గ్రమ అ వారి కంపి రస డి•గ్గ బాఱుఁ దేఁటుల్ పురిన్. 37

శా. తుండాగ్రంబులు చాఁచి యప్పురి మహో•త్తుంగద్విపేంద్రంబు లు
ద్దండప్రక్రియఁ గ్రీడ సేయుచు వియ•ద్గంగాసువర్ణాంబురు
కాండంబు ల్పెకలించుచో సుమపరా•గంబు న్మది న్మేనులన్
నిండం బంగరుకాఁడల ట్లలరు ను•న్నిద్రప్రభాలీలలన్. 38

తే. అగము లుర్వీధరారాతి•యాపనులకుఁ, దాఁ యప్పట్టణమునకు • వలసి వచ్చి
డాఁగి యుండినఁ బౌరులు•నాగము లని, క్రమ్మ యునిచిరి నాఁగనా•గములు దనరు.

చ. తలఁపఁగ దక్షిణోత్తరప•దంబుల కు తి నేగి యాఱునా
ల్నెలలకుఁ గాని క్రమ్మఱఁగ • నే క యేలిక నేట ముంచు ని
చ్చలు నిను తేరిమావు లని • సారెకుఁ గేరుచు దిక్కు లన్నియుం
గలయ నిమేషమాత్రమునఁ • గన్గొని వే మఱలుఁ బురాశ్వముల్. 40

చ. అనిలుఁడు లేడి నె క్క జవ • మారఁగ నప్పురిమేల్గుఱాలతోఁ
బని డి పందెము ల్చఱచి • పర్విడుచోటఁ గ ంగ మెత్తి వై

చిన్నచెలు వాయె నిప్పలుకు • సిద్ధము గా దని యాడినం బ్రకం
పనునకుఁ గేలు సాట్ట యని • పల్కుదు రే కద లోకు లిద్ధరన్. 41

తే. నాలుగును వేయి వక్త్రంబు • లోలిఁ గలిగి
శ్రుతులు భాష్యంబు నడపుట • ప్రతిభ యనుచు
విధిఫణీంద్రుల నిరసించి • వేదశాస్త్ర
ములు వచింతు రొక్కొక్క రాప్రోలిద్విజులు. 42

సీ. బుధవత్సలులు కళా • పూర్ణులు పరచక్ర, హరణులు కువలయా • హ్లాదకరులు
వసుసమన్వితులు స • ర్వజ్ఞశిరోమణుల్, శుభలక్షణులు పరి • శుద్ధమతులు
సహజలక్ష్మీకు ల • స్తమితతమస్కులు, మండలప్రభులు స • న్మార్గచరులు
మిత్రానుకూలురు • గోత్రాభ్యుదయులునై, వాత్రకు లోష • శ్వరులు సుప్ర
తే. సన్నతాభాస్వరులు పంక • జాతదళన, చతురు లతిశీతలప్రద • ర్శను లుదగ్ర
మోహనాకారరేఖాస • ముల్లసితులు, రాజు లలరుదు రప్పుర • రాజమునను. 43

తే. తనకుఁ దొమ్మిదిపాఁతఱ • ల్ధనము గల ద, టంచు జక్కులఱేఁడు గ • ర్వించుఁ గాని
లెక్క యిడరానిరొక్కంబు • లీడు లేని, కోలుములగలవెన్న నవ్వీటి • కోమటులకు.

క. అద్రులు తేజంబున నమ, రాద్రులు దానమునఁ గాంచ • నాద్రులు ధృతి సౌ
భద్రులు బవరంబున బల, భద్రులు భుజశక్తి నందుఁ • బరఁగెడుశూద్రుల్. 45

సీ. తమగానములకు సం • తసిలి పున్నాగము, ల్పస్ఫుటభోగలో • లతఁ జెలంగఁ
దమవిహారముల కెం • తయు భూజనుల్ చొక్క, సుమనోవికాసవి • స్ఫూర్తి నలరఁ
దమముఖాంభోజగం • ధములకు సరసాళు, లుప్పొంగి మదబుఁ • గప్పుకొనఁగఁ
దమమణినూపుర • ధ్వనులకుఁ బరమహం, సలు సోలి మానసా • సక్తిఁ దఱుమఁ
తే. దమమృదూక్తిసుధారస • ధారలకు న, శేషబుధపుంగవులు చెంతఁ • జేరి నిలువఁ
జెలువముల కెల్లఁ బుట్టిన • నెలవు లనఁగ, మెఱయుదురు ప్రోలఁబుణ్యభా • మినులు లీల.

చ. అపరిమితానురాగమున • నప్పురిలోనిబోజుంగుమిన్న లె
ల్లపుడు దినాంతవేళల హ • య ల్మెఱయ న్విహరింతు రెంతయు
న్విపణి హాంతరాగ్రమణి • నిర్మితకాంచనసాలభంజికా
లపనకపోలచుంబనక • లావివశీకృతహృత్సరోజులై. 47

సీ. చామల కెందు నీ • సరసత గలదె తొ, య్యాలి యన వరియింపు • నిలిచి చూడు
పడఁతి నిన్నంటి వె • ల్వడము కోర్కె ఫలించె, నన రాజభోగమే • యతిశయిల్లు
నారుగన్నను జిత్త • మలరెడిఁ జెలియన్న, మది కొప్పఁ గంటె వే • మఱుఁ జెలంగుఁ

బలుకొట్టు చూపక • నిలు మింతె యనిన న, వ్వలఁ గందికై సైగ • మెలఁపఁబొగుసె
తే. యనుచుఁ దముఁ జేరి నెఱజాణ•తనము వెలయఁ
బలుకు నెలకోడె ప్రాయంపుఁ•బాంథజనుల
కింపు దులకింప మాటమాటి • లిడుచు నుండ్రు
శాలిపాలీవధూటు లా•ప్రోలఁ జాల. 48

సీ. సరసిజంబులు సారె•సారెకు నెనయించి, యంబుజంబులు ప్రియం • బలరఁ జేర్చి
చంపకమాలిక • లొప్పం బెసంగ నమర్చి, విచికిల స్తబకము • ల్విస్తరించి
యుత్పలమాలిక • లొఱపుగాఁ బొసఁగించి, కడుసుకేసరము ల•క్కఱఁ బెనంచి
లలి వెలయు సుపజా•తులు నాడెముగ నిల్పి, మఱియుఁ జే రగువన•మంజరులును
తే. గరము మెఱయించి సుకవుల•కరణిఁ బెక్కు-
చందముల నీటుఁ జూపుచు • సరసులను బ్ర
బంధలీలల నలరింత్రు • పటువిలాస
భాజనములందుఁ బుష్పలా•వీజనములు. 49

శా. వీట న్మాటికి నంగసంగరకళా•విక్లాంతకాంతామణీ
కోటీపీనపయోధరాగ్రవితతాం•కూరన్నిదాఘోదక
టీకాపహృతిక్రియారభటిఁ బెం•పారుం బ్రభాతంబులం
బాటలాచలకూటనిర్గతజగ•త్ప్రాణార్భకవ్రాతముల్. 50

చ. పనివడి పంటపైరులకు • బాళిమెయిం జనుచిల్కమూఁకలం
బనులకుఁ గ్రమ్మఱం దఱిమి•వైచు నుదంచితశాలిపాలికా
స్తనకలశద్వయీనిహిత•సాంకవగంధమలిమ్ముచత్వభా
గనిలకిశోరవారము ల•నారతము న్నగరాంతికంబునన్. 51

క. ఆనగరికి నధిపతి యై, యానగరిపుకరణి శివి • నలరుచు నుండెన్
భూనుతుఁ డర్చిష్మంతుఁడు, నా నెసఁగు నృపాలవరుఁడు • నయతత్పరుఁ డై. 52

క. ఆరాజమణికుమారుఁడు, మారుఁడు సౌందర్యమునఁ గు•మారుఁడు కడిమిన్
సూరుఁడు తేజంబున ఫణి, హారుఁడు గరిమన్ ఋతుధ•జాహ్వయుఁ డెన్నన్. 53

సీ. కాశకాశాధిపా•కాశధునీహార, నీహారకలశవా•ర్నిధులఁ దెగడి
సోమసోమామర•సామజతారకా, తారకాదంబబృం•దముల నవ్వి
చంద్రచంద్రాతప•చంద శారద, శారదాంభోదకే•సరుల నెన్ని
గోపగోపారదేం•దూపలసంతాన, సంతానఫేనవ•ప్రజములఁ గేరి

తే. మీఱితి తనకీర్తి జగముల • మెఱయ నలరె, నిఖిలభూభర్తృగణోదగ్ర•నిజభుజాగ్ర
జాగ్రదుగ్రమహామండ•లాగ్రదళిత, దుర్హృదుర్వీభుజుండు ఋ•తుధ్వజుండు. 54

సీ. కమనీయకలధౌత•కాంతుల నిరసించి, ద్విజరాజనిబిడదీ•ధితుల నెంచి
జలజభవప్రభా•సముదయంబు జయించి, యమరవిద్రుమశోభ • నపహసించి
షణ్ముఖజనకభా•స్వద్విభావళి మించి, హంసమండలదీప్తి • నావరించి
చారుపయోజాత•భూరిద్యుతులఁ గాంచి, మంగళసద్రుచి • మహిమ వంచి

తే. తనసమంచితకీర్తిప్ర•తాపములు ది, గంతరంబుల వెలయ సు•దగ్రలీల
వఱలె నఖిలధరాధురా•వహనముదిత, కరికమఠకిరిగిరిహారీ•శ్వరుఁ డతండు 55

సీ. కువలయంబున కార్తి • గూర్పనియినుఁడు చ, క్రావళి నొంచక • యలరురాజు
గోత్రవైరము గూర్చు•కొననియింద్రుఁడు పుణ్య, జనులఁ గాఱింపని•చక్రవర్తి
పక్షపాతము లేక • పరఁగుచుండువిరాట్టు, పాడి దప్పనిప్రజా•పరివృఢుండు
కుజనులపొందు చే•కొననిధరాధిపుఁ, డుగ్రుఁ డై ప్రజఁ ద్రుంప•కుండు నీశుఁ

తే. డౌర యితఁ డని బుధజను • లభినుతింపఁ, వఱలెఁ దేజఃకళావైభ•వప్రభావ
జవవచఃస్ఫూర్తి ధృతిమహై•శ్వర్యములను, విపులగుణపాళి యమ్మహా•నృపతిమౌళి.

సీ. చాంచల్యమబ్జలో•చనలచూపులయంద, కుటిలత సతులముం•గురులయంద
కాఠిన్య మింతుల•గబ్బిగుబ్బలయంద, లేమి లేమలమధ్య•సీమలంద
బంధము ల్ఛందన•గంధులరతులంద, జడత ముద్దియల నె•న్నడలయంద
చిక్కులు మత్తకా•శినులహారములంద, పీడ చేడియలకెం•బెదవులంద

తే. కానిమఱి యెందు నేనియుఁ • గలుగకుండ, ధరణిఁ బాలించె నఖిలభూ•ధవకులేంద్ర
కోటికోటీరమణివిభాం•కురవిరాజ, మానచరణాబ్జయుగళుఁ డ•మ్మనుజవిభుఁడు. 57

తే. దరికిఁ జేరిన నరికోటి • దరికిఁ జేరు, శరము పూనిన నహితాళి • రము పూనుఁ
గొమరు మీఱినయారాచ•కొమరుతోడ, సరియె శూరులు మనుజకే•సరియ కాక. 58

వ. అట్లు సమగ్రలీలావైభవోదగ్రుం డగునమ్మహీపాలాగ్రగణ్యుం డమందానందకందళి
తహృదయారవిందుం డగుచు నొక్కనాఁడు. 59

సీ. పగడంపుగుండ్రకం•బములు మేలికడాని, దూలముల్ జాబిలి•ఱాలమెట్లు
పులుఁగుఱాపచ్చబో•దెలు తళ్కుమగమాని, కంపుగోడలు తమ్మి•కెంపువెడఁద
తలుపులు పటికంపు•ద్వారబంధంబులు, తెఱగంటిరాచఱా•తిన్నియలును
వైడూర్యవలభిక • ల్వాటంపుగోమేధి, కపుజలయంత్రముల్ • కడిఁదిముత్తి

తే. యంపునేఁతలు పుష్యరా•గంపుజాల, కములు రవికాంతమణివలీ•కములు రజత

సీ. కౌంజులు పూరేళ్లు • కన్నెలేళ్లు నెమళ్లు, లావుక గోరువా • ల్లకుముకులును
గోక్కురగల్ కక్కురల్ • గువ్వలు వెలి లు, నేలనెచుల్లును • బోలుగలును
గారు. పసిండి•కంటె లేత్రింతలు, పాలలు పరుజులు • పావురాలు
పికిలిపిట్టలు గ •పిట్టలు గోవలు, బంగరుపిచ్చుకల్ • పసపుముద్ద
తే. లాదిగాఁ గల ,లుఁగు లఁ•యారె బిట్టు, నెట్టుకొని కోనలోఁ గను•పట్టి యున్న
వధిప వేఁటకు వేంచేయు • నవ్వ మిప్పు, డనుచుఁ బల్కిన వారల • నాదరించి. 67

క. గయావిహారలంపటుఁ, డగుచు నపుడె చదరు డిగ్గి • యతిరయమున న
తీరమణశిరోమణి, తగ నంతఃపురికిఁ జనినఁ • దత్సమయమునన్. 68

చ. తడయక యూడిగంపునెలఁ•తల్ నృపుడగ్గతి మానికెంపుబ
ల్లొడవులు వు క్రొందడపు•దోవతి గట్టఁగ నిచ్చి పచ్చటా
బెడఁగుఁగడాని నిపని•షెం పగుముక్కలిపీఁటమీఁద సొం
పడర వసింపఁ జేసి విన•యంబుఁ బ్రియం బిగురొత్త నత్తఱిన్. 69

సీ. మురు వైనహురుమంజి•ముత్తియంపుసరంబు,లుదుటుగుబ్బలమీఁదఁ • బొదివియాడఁ
గరములరత్నకం•కణములు గాజులు, ఘులుఘుల్లు మని తాళ•గతులఁ జెలఁగ
సొంపారుగడితంపు•సోగముంగురులు నె,న్నొసలిపై ముసరి పెం•పెసలు గూయ
మహనీయతాటంక•మణిగణచ్యుతులు క్రొం, దళుకు లేఁజెక్కు•టద్దములఁ బొదలఁ
తే. గౌను నర్తింప నూర్పులు•గ దళింప, నలఁతిచెమ్మటు నెమ్మే న• నంకురింపఁ
బసిఁడిగిన్నెయలో నిసం•పంగినూనె, వనజముఖి యొత్తు దల యంటె • మనుజపతికి.

సీ. గమగమవలచుచొ•క్కపుఁగమ్మకస్తురి, నలుగిడె నొకమద•నాగయాన
కలయు గంధామల•కం బిడె నొదలఁ, దలకొని యొకముద్దు•కలికిమిన్న
దోరంపుఁబన్నీట • దొరలించి జలకంబు, లార్చె నొక్కసరో•రుహాయతాక్షి
తడయక నెమ్మేను•నిడుసోగ పెన్నెరుల్, దడి నొక్కకాం•తాలలామ
తే. జిలుఁగునిద్దంపుమడుఁగువ•ల్వలు ధ ంప, నిడి మనో రా•కేందువదన
సికను నెత్తావి క్రొ గొ•జ్జెంగసరులు, టు నొకనీలవేణి యా•క్షోణిపతికి. 71

తే. నిలువుటద్దంబు ముంగల • నిల్పి మేలి, కమ్మకస్తూరి క చొ•క్కపుఁ గ నొసలఁ
దీర్పఁగాఁ జేసె నొకవధూ•తిలక మప్పు డోలపు రాణింప నా షా•లోత్తమునకు.

క. అగరుసితాభ జవాదీ, మృగమదచందన మాంబు•మిళితం బై సొం
పుగ వలచు లికలపము, జగతీపతిమేన నొక్క•సకియ యలందెన్. 73

క. జిలిబిలివలిలేగాడుపు, లేలయఁగఁ బూసురటి విసరె • నిమ్ముగ నొకతె

వలకచ కరకంకణములు, ఘలుఘల్లని మెఱయ రాజ•కందర్పునకున్. 74

సీ. పులుఁగురాపచ్చబ•ల్చిలుకతాళియ నొక్క, సుదతి పేరురమునఁ • గూడుగుపఱచె
సొంపారు నాణెము•త్తెంపుఁజౌకటు లొక్క, కలకంఠకంఠి వీ•నుల నమర్చె
గాటంపు నెఱమాని•క పుటుంగరము లొక్క, తలిరాకుఁబోఁడి యం•గుళుల నునిచె
మురుగులు నపరంజి•మురిడీగొలుసు లొక్క, విమలాంగి హస్తప•ద్మముల నిడియెఁ

తే. బసిఁడికమ్మరుపటుయొక్క•కిసలయోష్ఠి, మొలను దవిలించి సరపిణి•గొలుసులొక్క
తెఱవ వెరవార గూర్చుతుగ • నలుత నించెఁ, జెలువు దైవార నారాజ•శేఖరునకు.

తే. హరువు మీఱెడిపసిఁడిప•ళ్లెరమునందు, రసరసాన్నము లిడి యొక•రాజవదన
యింపుసొంపులు వెలయ భు•జింపఁ జేసె, మణిగృహంబున నారాజ•మణిని నిలిపి.

క. ం లి వార్వఁగ నీ ల్లిడె, బంగరు నెఱగిండితోడఁ • బరువడి నొకసా
ంగవిలోచన యానృప, పుంగవునకు మదిని గూర్మి • పొంగారంగన్. 77

తే. తావికపురంపుబాగాలు • తగటుఁబండు
టాకులును మేలివలిముత్తి•యంపుఁగ్రొత్త
సున్నమును గూర్చి యొకప్రోఢ • యన్నుమిన్న
యన్నరాధీశునకు విడెం • బందియిచ్చె. 78

క. అంతట నానృపశేఖరుఁ, డంతఃపురి వెడలి వేడ్క • లంతంత కెదన్
దొంతరలై పొదువఁగఁ గడు, వింతగ మొగసాలకడకు • వేంచేసి తగన్. 79

. భేరులు కాహళు • ల్పి క్రోవులు పె , బూరలు తుడుములు • భోరుకలుగ
మణికేతనములు చా•మ ములు ముతా ల, గొడుగులు నరిగెలు • గొఱలి తరలఁ
గరు ల ములు శతాం•గములు వరూధినుల్, గడు నేలయీనిన•కరణి నడువఁ
గవులు గాయకులు మా•గధులు వేశ్యలు నటుల్, పరిహాసకులు మో ల•బలసికొలువఁ

తే. బసిఁడిబెత్తులవా రిరు•దెసలఁ గ్రమ్మి, జతన దేవ పరాకు హె•చ్చరిక యనుచుఁ
గ ముబేడుకతో బరా•బరు లొనర్ప, దొరలు ప్రెగడలు జనవరు • ల్దోడ రాఁగ.

ఢ బాణా ల్పటాలు న• లికఁ బూని
ద క కొనుచు •బ్బ పు ర
నురల్ — ఁ
ఎ – 81
వల లై• గు • డక బూని
ంఁ •ధ చనఁగ.

కావ్యరాజము [illegible]

ప్రథమాశ్వాసము T. Partha Sarathy

సీ. తెలిపూరుమంజిము• ముత్తియపుఁజౌకటులక్రొం, దళతళల్ చెక్కుట•ద్దములఁ బొదలఁ
గలి రాచిలుక లె•క్కల లెక్కఁగొననిసో, యగపుఁబచ్చలతాళి•యలఁత మెఱయ
నవ రత్నమయకంక•ణము లుంగరము లంగ, దము లాదియగుభూష•ణములు వెలుఁగఁ
జలువక్రొందగటంచు•జిలుఁగుదుప్పటివలె, వాటు నెమ్మెయి వింత•నీటు చూప
తే. నిము గా మేల్పసిండితా•యెతులు మొల్ల, విరిసరు లద్దుముగఁ జుట్టి • వ్రేసినట్టి
యో సికమీఁదఁ బైచెంగు • లునిచి కట్టి, నట్టిబురుసారుమాల్గాయ • లిట్టుదనర.
సీ. తీరుగాఁ గొనగోర • దిద్దినిడుదక, స్తురిరేక నొసల మే•ల్సొగసు లీన
మొలకట్టుకాసెలో•పల బిగ్గఁజెరిపిన, బలుతమ్మికెంపుల•బాఁకు మెఱయ
దండగా మగరాలు • దాపినబలితంపు, గండపెండేరము డా•కాలఁ గ్రాలఁ
బస నించునిద్దంపు•బవిరిగడ్డముసొంపు, రుచిరనీలోపల•రుచులఁ దెగడఁ
తే. గప్పురము సాంకవము మంచి•గంద మగరు, గస్తురియుఁ జాఁదుఁ బన్నీటఁ•గలపియిడిన
కడిఁదిమైపూఁతకలపంపుఁ•గమ్మతావు, లిమ్ముగా నెల్లదిక్కులఁ • గ్రమ్మికొనఁగ.
సీ. పసిఁడిపక్కెరజర•బాజు మెత్తాముత్తి, యంపుజొంపములు చొ•క్కంపుఁగెంపు
టంకవన్నెలు గిల్కు•టందియల్ జల్లులు, జిలుఁగుఁగ్రొందళుకుఁగు•చ్చులతురాయి
చికిలికల్లెము క్రొత్త•ముకమాలువాగె హొ, రంగారుజరతారు•టంగువారు
బిరుదుగంటలు గజ్జె • లరిదిలకుంపటా, ద్రిప్పదండెలు భూరి•దివ్యమణులు
తే. గలితశుభలక్షణము లురు•గతులు గడిఁది, తేజునందంబు జవమును • దిటము గలిగి
రాణఁ దనరారుమేటిసా•మ్రాణి నెక్కి, హాళి దైవార నపుడు వా•హ్యాళి వెడలె.

చ. వెలువడి యోలిఁ బ్రోలినడు•వీధిజనంబులుఁ బౌరకామినుల్
వలకొని మేలికప్రపుని•వాళు లొసంగుచుఁ బొంగి యొండొరుం
దలఁగఁగఁ ద్రోచి యానృపవ•తంసముఁ జూచి మదిం జెలంగుచున్
జిలిబిలిక్రొ ముత్తియపు•సేసలు చల్లిరి పెల్లు మీఱఁగన్. 86
చ. జలధరవేణు లిందుమణి•సౌధతలంబుల నిచ్చి మించుఁదీఁ
గలనిరసించుమైరుచులు • గ్రాలఁగ ముత్తెపుసేసఁబ్రాలు భూ
తలపతిమీఁదఁ జల్లిరి ము•దం బలరార ఘనాఘనంబు ల
గ్గలముగ నింగి నుండి వడ•గండ్లు పొరింబొరి రాల్చుకైవడిన్. 87
ఉ. అన్నులమిన్న యొర్తు వసు•ధాధిపనందనుఁ జూడఁ గోరి వా
ల్గన్నులఁ గుంకుమంబు నొస•ల న్నవకజ్జలమున్ ధరించి లో
నెన్నఁగ రానితత్తరము • హెచ్చఁగ న రాజ ద్ధతిన్

పాటీరభూమిరు•ట్కోటరాంతర్లగ్న, ఫణిఫణామణివిభా•భాసురంబు
పరిఫుల్లచంపక•ప్రసవరజశ్శస్త, నికటసరస్తోయ•నిస్తులంబు

తే. గం వేదండమండల గండయుగళ, గళితదానాంబులహరికా•మిళితలలిత
పరిణతాస్తోకమాకంద•ఫలరసప్ర, వాహమగుపూగవాగ ము• నము దనరె. 98

తే. శల్యకదళిప్రియకశివా•చమరకస్త్ర, కుంభిగోహితనాగముల్ • గొలలునందు
శల్యకదళిప్రియకశివా•చమరకస్త్ర, కుంభిగోహితనాగముల్ • గొలలునందు. 99

సీ. శక్రకరంభాపారి•జాతకైరావత, ఖ్యాత మై నాకలో•కంబుకగణి
గాలవశాండిల్య•కౌశికకపిలాది, వాస మై ధాత్రుని•వాసమట్లు
వృషకుమారకశివా•ప్రియశివాపరికలి, తం బయి రజతభూ•ధరముమాడ్కి
మదనసుపర్ణక•మాధవలక్ష్మీ స, నాథ మై వైకుంఠ•నగరిగరిమ

తే. సంతతానంతనాగేంద్ర•స త మగుచు, విలసితం బగునలకసా•తలముపోల్కి
నెసఁగునకాననంబు మ•హీతలేశ, కుంజరున కాత్మఁబ్రమదంబు•గూర్చె నపుడు.

తే. భోగినీగాఢపరిరంభ•సౌగమునఁ జె, లంగునచ్చోటిమేటిభు•జంగకోటి
పద్మినీభ సంభోగ•పాగవశ్య, లీలఁ బున్నాగనికరంబు•గ్రాలు నందు. 101

క. పరఁగెన్న కరికిరికా, సరశరభతరక్షుఖడ్గ•శశవ కహరివా
నరగవయశల్యభల్లుక, హరిణవ్యాఘ్రాదిమృగకు•లాకుల మగుచున్. 102

వ. ఇట్టివిచిత్రలీలావై వంబులకుం దానకం బైనయకాననంబు ప్రవేశించి యా పాల
శేఖరుండు. 103

క. తమకమున మేల్పతాణికె, దుమికించుచు బరుగువైచి•దోర్బలవిభ
బమర నాంతరమునఁ బే, రిమి మెఱఁగఁ గొంతతడవు•ద్రిమ్మ యుచుండెన్. 104

తే. భటులు నటులనె నిగ రా•ర టులు నిగుడ, లగు శరభ ఘనసర•లాత్రిశూల
పరశుకరవాలికాచ్చు•ప్రముఖనిఖిల, సాధ ము లూ ఓ •జంటఁ జనిరి. 105

తే. పసిఁడిగొలుసులు జరతారు•పట్టె లును, మేలిహా • మెడల గొప్ప
వెండిమువ్వలు పొదలంగ•గండుమీఱి, సాగె రంపు•జాగిలములు. 106

క. మోరలు దివి కెత్తుచు భౌ, భౌరవములల ఁ జెలంగె • ఘకము లపు
త్తారాపథ మంతయు నొక, తూరిమొకబళింపఁ బూని • తో రె ననంగన్. 107

తే. అపుడు గొందఱు గయు లయ్యడవిఁదూఱి, ఘోరముగ నె కడలఁగ•గ్గోలుగాఁగఁ
గూఁ లిడిచోఁపుడుయుమృగ•కులము గలఁగి, బ యలు వెడలినఁ ంచియ•పా్ప వుండు.

శా. సారంగంబులఁ జెండి సింగముల ని•స్సారంబుగాఁ ద్రుంచి భూ

దారవ్యాఘ్రతరక్షుఖ శశగండభర ంబుల నంధమా
ర్గారశ్వావిధ నేకపక్షురురులన్ • జక్కాడెఁ గుంతచ్ఛురీ
నారాచాసిగదాత్రిశూలముఖనానాదివ్యశస్త్రంబులన్. 109

సీ. పులులమొత్తంబుల • బోనులఁ జొరఁ దోలి, గండ్రగొడ్డండ్లచేఁ • జెండి చెండి
వలలలోఁ జిక్కి పోవఁగ లేనికుందేళ్లఁ, గదిసి పెన్గుదియలఁ • జదిపి చదిపి
ఘుర్ఘురధ్వనులఁ బైకొనవ పందులఁ, గుఱుచబల్లెంబులఁ • గుమ్మి కుమ్మి
బెదరి చెంగున దాఁటి • చెద పాఱెడులేళ్లఁ, బెడుగువేపుల కెర. • చేసి చేసి

తే. యసినిశాతాంబకంబుల • నచ్ఛభల్ల, శల్యశంబరహర్యక్ష • శరభగవయ
చమరసృమరాదికంబులఁ • ంపి చంపి, వేఁట గావించి రా తేని • వీరభటులు. 110

తే. ఖడ్గముల ఖడ్గములఁ ద్రుంచి • కడిమి నచ్ఛ, భల్లముల భ ములఁ జంపి • పెల్లు మీఱ
శల్యముల శల్యముల బిట్టు • చదిపి పతికి, మోద మొసఁగి గొందఱు • జోదు లపుడు.

సీ. అదె కరి యిదె కిరి • యదె హరి పోనీక, పొడు పొడుం డని బొబ్బ • లిడెడువారు
పులిఁ గ్రమ్మకొని పులి • పులిగ నీఁటెలఁ గ్రుమ్మి, యేపుతో మగటిమిఁ • జూపువారు
శరభావలుల ఘోర • శరభావలు లెలర, నెలసి భూ లిఁ ద్రెళ్ల • నేయువారు
సారంగముల మన • సారంగఁ బైకొని, కొట్టి పెన్గుట్ట ఁ • బెట్టువారు

తే. కొండగొటియల దప్పల • గండకముల
ఖండఖండంబులుగఁ జేర్మి • నండగొనఁగఁ
జెండు చెండాడి యుక్కునఁ • జెలఁగువారు
నగుచుఁ గ్రీడి చి రా కొంద • ఱధిపు మ్రోల. 112

. పసివట్టితోఁ లు • పి తారుచుఁ జెవుల్, రికిరించుకొ దిశల్ • రేసి చూచి
కొఱకొఱఁ బరువి • మఱలి మోరలు చాఁచి, పొదలు దూఱుచుఁ జుట్టి • పొంగువారి
గొదకొని నెమకుచు • ఘుర్ఘురధ్వనులతోఁ, బైకొని వచ్చుబల్ • పందిగమికి
మొగి చివ్వన మీఁది • కె సి కొంకులు గోళ్ల, ములు మెడ గ్గలయాయ • ములు విడంగఁ

. అ పెట్టు నెడల • నక్కజపులావు, లెలయఁ జీకొన నీడిచి • యేపు చూపి
లం జా ఁ మదంబు • గుడ ,సర యె డ నాడెంపు • జాగిలములు.

114

యే, అపి • బ తునిమి
చ డే • మా
ర బుల న్ఫి • గం డ చి

నేల నెమళ్ళపై • నేలాపుడేగల, విడిచి యేపునఁ బీఁచ • మడఁపఁ జేసి

తే. పసపుముద్దయుఁ బాలయుఁ • బచ్చకప్ప, పసిడికంబెరయుఁ • బరజయుఁ బసులపోలి
గాఁడు ననువానిపై జల • కట్టియలను, బంచి తుంచిరి కొందఱు • బంటు లపుడు.

తే. అట్లు దమకంబుచే వేఁట • లాడి మృగమ, దంబుఁ జామరములు గజ • దంతములును
బిల్లిగడ్డలు పులిగోళ్లు • పికిలిచెండ్లు, నాదిగాఁ దెచ్చి యిచ్చి ర • య్యవనిపతికి. 116

తే. అంత నవ్వేఁట చాలించి • యవని భుఁడు, సేన గొలువంగ నవ్వని • చెంత నొక్క
పటకుటీరంబు వేయించి • పాయ కెదను, మించు వేడ్కలఁ దగ విశ్ర • మించి యుండె.

క. అని వనజాసనుఁ డెఱిఁగిం, చిన విని సురమౌని ముదిత • చిత్తుండై యా
తని నవ్వలికథ యెల్లను, వినిపింపు మటంచుఁ దివిరి • వేఁడుకొనుటయున్. 118

మ. పురుహూతాగ్నిపరేతరాట్పలభుగం • భోధీశవాతా పాం
బరకేశాబ్జభవాచ్యుతాదికమహా • బర్హిర్ముఖానీకభా
స్వరకార్తస్వరవిస్ఫురన్మకుటశ • శ్వత్పద్మరాగప్రభో
త్కరనీరాజితపాదపద్మయుగళా • కాకోలభాస్వద్గళా. 119

క. దృక్కర్ణక భూషణ, వాక్కాంతాకాంతముఖ్య • వందిత మహికా
రుక్కోటికోటిభాస్వర, కుక్కుటలింగాభిధాన • కుతలనిధానా. 120

ఉత్సాహ. పురవిభంగ ధరనిభాంగ • భూశతాంగ శశివిభా
కరరథాంగ ముకుటగంగ • కరకురంగ సంహృత
సు రదనంగ [illegible]తభుజంగ • సుగుణసంగ మునిమనో
బుధహాభంగ ప్రసుతురంగ • భువనమంగళప్రదా. 121

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్షుని శుణసంప సరసకవితాసామ్రా
జ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్య గోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్య
పుత్త్రసకలసంసు తాంధ్రలక్షణకళాకౌశలాభిరామతిమ్మకవిసార్వభౌమప్రణీతం
బయిన రసికజనమనోరామంబను శృంగారప్రబంధంబునం బ్రథమాశ్వాసము.

గీరశారీరుత•కింకిణీరవయు నం, చితసరఘాస్వన•సీత్కృతియును

తే. నవపలాశద్రుమకోరక•నఖపదయును, గంధమారుతనిశ్వాస•గాఢతరయు
నగుచు వనలక్ష్మి చైత్రస•మాగమమున నలఘుసంభోగలాంఛనం•బులఁ జెలంగె. 15

సీ. పల్లవశ్రేణి క•ప్రబంపురాగ మెసంగె, తఫలంబులు ద్విజ•ప్రతతి కొదవె
సుమనోవికాస మ•చ్చుగ భూజచుల కబ్బెఁ, జాఁగెఁ బల్మఱు మరు•త్సంభ్రమములు
చండాలులకుఁ బొల్పె•సఁగె మధుపానా ప్తి,యమితరసాలకాం•డములు మెఱసెఁ
బ్రసవధర్మక్రియా•పరత నొప్పిరి గృహుల్, ప్రబలె నర్చులు చిత్ర•భానునందుఁ

తే. గుంభినీవ భులకు మిం•క్కుటపుదాన, గుణము వాటి ఁ ద్రిభువన•ప్రణుతనిఖిల
ంతుసంతాన దయరం•జకమనో , లీల నలరువ ంతర్తు•వేళయందు. 16

క. పు డా పుఁ డటఁ దరలెఁ, విపి విహారానుమోద•విచలితమతి రై
పనఘృణివిసర రహిత, విపథంబున నర్మసఖుఁడు • వెంబడిఁ జనఁగన్. 17

వ. అట్లు దర కుహరాంతర హరహుణా ంతకంఠీరవఘోర్వారవాక నాతిప్రకంపి
తాఖిలహరిద ంతి తానంబును ర్భ నికుం సంజవనాంగణా గ్గ మా ని తజా
గ హోగ్రవ్యాఘ్రకోటిధాటి పలాయితరురుకురంగ ముఖనిఖిలత్తుద్ర కులా
కులంబునుమదోగండవేదండమండలగండస్థలనిస్సరద్దానధారాపూరాభిషిక్తా ప్రదే
ంబును బ స్ప కరాఘాత గ్న య స్రవద్రుధి ధారాప్రవాహపరివ్యాప్తవ
హావాహాయి పూ హంబునుబ టి గు స్ఫుటికోటీకుటీరాంత గ్న భుగ్న భు
జంగఫుం వోత్తుం గ్రరం ర ణి ణ భాభాసమానంబును ని డజంఝూస
మారప్రేరితధావద్దా పా కా ల లాజాలజా ల్యమా నానానోకహచ్ఛటాచ్ఛ
టచ్ఛట నాదమేదురంబును సరస ఘావిసరఖ దనావ శి లపృథులమధుకోశని
శన సా సాసా వర్షో గ్ధంబును నవారితమారుతానారతపూరితభూరితరవేణుని
దా ంబును సభ రాధరాధిత్యకాసము తసు ర ర్ఝరీత రోషనితాం
గా మ పాము ర్న టదుత్కంఠనీ కంతానీకాస్తోక కారవా తం బును
ట విహా లా ము సగి వో ని రాలాప కోలాహలధ్వాన
రా బును గఖగసం సంకులంబును
చిత్రా రం గు మ ణ్య బు చొ.
1

గ్జనితక్రోధరణన గాధిపకులు ·యద్దరీభాగముల్
ఘనగంభీరసరిఝ్ఝు తటకటు·నా గంబు శీతాగమున్. 19

క. కని యన్న గాగ్రభాగం, బున గి తదీయచిత్ర·ములు గనుఁగొనుచున్
మునుకొని తిరుగుచు నుండెన్, జనవరకుంజరుఁడు నర్మ·సచివుఁడు దానున్. 20

క. దరులం బూఁజప్పరముల, దరులన్ శృంగారలీలఁ · దనరెడుకాకో
దరుల న్విద్యాధరసుం, దరులం బొడగాంచి యతఁ డెం·దం గడు నలరెన్. 21

సీ. భిల్లయోషిత్పద·పల్లకోల్లిఖితకం, కుమరసాంకితమణీ·కుట్టిమంబు
కాకోదరీకుచ·కలశద్వయీలిప్త, హారిద్రముద్రితా·శ్మాకరంబు
కిన్నరీజనరతి·క్రీడాంతరస్రస్త, కుసుమోత్కరాకీర్ణ·కుంజగహము
దివిషద్వధూప్రతి·దినదోహదక్రియా, వికసితామ్రాదికో·ర్వీయహంబు
తే. ఖచరవరవర్ణినీకర·కమలనిభృత, సురమహీజాతజాతప్ర·సూనరచిత
తతసుగంధాన్వితోదగ్ర·తాలవృంత, గంధవాహకిశోర మా·శ్మాధరంబు. 22

సీ. అమరసరిత్కాంచ·నాబ్జపరాగసం, ఛన్నమహారత్న·సానువులును
గ్రీడాసమాసక్త·కిన్నరీచరణలా, క్షారసాంకితఝురీ·సైకతములు
గంధద్విరదఘటా·కటగళదానవా, ర్బిందుసంసిక్తద·రీతలములు
శుకశారికాకోక·పి రాజహంసమ, యూరస్వనోల్లస·దుపవనములు
తే. సిద్ధవి ధరోర ·స్త్రీకుచాగ్ర, లిప్తహారిద్రచూర్ణసం·శ్లిష్టభూరి
వనాంచ వ్రికృష్టస·రోవరములు, గనుఁగొని చెలంగె నప్పు డ· నవరుండు. 2

సీ. శిఖరాగ్రవిస్ఫుర· మూతదర్శన, ప్రమదన త్య త్త·బర్హిణములు
నిర్మలకాసార·నీర రజనాళ, కబళనో తహం ·కాదులములు
పరిఫుల్లమ కా·ప్రసవరసాస్వాద, నాలోలరోలంబ·జాలకములు
మృదులామ్రనూతన·చ్ఛదచర్వణోన్మా , కూజతోద నేక·కోకి ములు
తే. సారసహకారమంజరీ·సౌరభములు, కు బృందాచ ర ద·బిందుసహిత
శీతలస్ఫీత దవాత·పో ములును, హ మోగూ చ క·య ద్రియందు.

ఉ. క్రొన్ననతీ పందిరుల · గినీటివెడ దవా గులన్
వెన్నెలరాచరాచలువ·వి ప్పటరుంగులఁ గప్పురంపుబల్
దిన్నెయల న్తోయ లె అయిఁ · ద్రిమ చ్ఛగపు బోండ్లు రా
మిన్నకుఁ దద్ద వేడుక · వీాఁ జే రి యన్న ంబునన్. 25

సీ. అశ్రాంతసుమనస్స·మాజపూజి దః, డవిరళ కాళీస·మన్వితుండు

హృదయాహ్లాదకరీ నమ నమనో॰ ప్టా సంధాయి
మది నె ప్పుడు స స్మ ంతు నిను నే॰మం బొప్ప మందాకినీ. 33

మ. అవని నా నవుఁ డెవ్వఁడేని భవ ॰యాలోలకల్లోలవా
ర్లవసంసి _నిజప్రతీకుఁ డగు నా॰ప్రాజ్ఞుం డమ య్యంద్రపూ
ర్ధవళాక్షీకరకంకణక్వణనమి॰శ్రప్రోల్లసచ్చామరో
ద్భవని స్తంద్రమరుత్కి-శోరములచే॰తం జొక్కుఁ బో జాహ్నవీ. 34

సీ. బ్రహ్మహత్యాదిదు॰ర రమహాఘవిభంగ, ఘనతరతరళతరం॰గ త్తరంగ
విపులసైకతభాగ॰విల తచక్రాంగ, హరజటాజూటకూ॰టాగ్రరంగ
కనకారవిందసం॰గతచలన్మదభృంగ, సూరిజనస్తుత॰సుప్రసంగ
యమరీకుచాలి ప్త॰హారిద్రసంసంగ, సతతసమాశ్రిత॰శైలశృంగ

తే. యతిదయాపాంగ పుణ్యమ॰యాంతరంగ, ప్రచురగంభీరనీరాంత॰రప్రమగ్న
మ త్తమాతంగ నీకు న॰మస్కరింతు, దివ్యశోభాప్రదీప్తాంగ ॰ దివిజగంగ. 35

తే. పరుస మించుక సోఁకి య॰బ్రముగ నినుము, పసిఁడియగునట్లు తావక॰ప్రవిమలాంబు
కణ మొకించుక సోఁకిన॰ఖలజనుండు, మిగులఁ బరిశుద్ధుఁ డగుఁ గదా ॰ గగనతటిని.

చ. తమి నొకనాఁడు మానవుఁడు ॰ దవ్వులఁ దావకవీచికానినా
దము చెవిఁ గీలుకొల్పిన న॰తండు వినండు గదా సురాపగా
శమనలులాయకంఠపరి॰సర్పితభూరితరోగ్రఘంటికా
సముదయలోకభీకరవి॰శంకటసాంద్ర ణంఘణధ్వనుల్. 7

క. యోగిజనానందకరీ, యాగమసంస్తుతలసత్ప॰దా బుజయుగళీ
భోగాపవర్గదాయిని, భాగీరథి నేఁడు ననుఁ . ॰పం గనుఁగొనవే. 38

క. ధాతృపితృచరణతలసం, భూతా భువనప్రపూత ॰ బుధనుతసుగుణ
వ్రాతా విరజాసలిలో, పేతా నను ధన్యుఁ జేయ॰వే గుహమాతా. 39

॰ అని యనేకప్రకారంబులం బ్రా ంచి తదంభఃపూరంబునఁ గృతావగాహుం డై సం
ధ్యా- నుష్ఠానక్రియాకలాపంబు నిర్వ _ర్తించి తదంతికప్రదేశంబున విహరింపుచుండి
పురోభాగంబున నొక్క-చోట. 40

తే కనకమణిమయసోపాన॰గర్భగేహ, కుట్టిమాకరమంటప॰కుడ్యగోపు
రేందుమణిపీఠికాసమ॰న్వితమహేశ, భవ మొక్కటి గాంచె సం॰భ్రమ మెలర్ప.

తే. కాంచి య వలము ప్రవేశించి యందు, విమలతేజస్సమగ్రత ॰ వెలుఁగుచున్న
దివ్యలింగంబుఁ బొడగాంచి ॰ నవ్యభ _క్తి, యమరఁ గరపంకజాతయు॰గ్మము మొగిడ్చి.

సీ. కాలకాలాయ దిక్పాలఫాలస్థక, స్ఫూర్తికాంకితపదాం•భోరుహాయ
దేవదేవాయ రా•జీవజనోగ్రదు, గ్గర్వనిర్వాపణ•కారణాయ
మారమారాయ సం•సారవార్ధినిమగ్న, సేవకోత్తారణ•నావికాయ
వామవామాయ సౌ•దామనీదామస, మానమానితజటా•మండలాయ
తే. శూలినే భూరికరుణాకృపా•శాలినే సు, శీలినే శశ్వదఘతూల•కీలినే క
పాలినే విశ్వలోకైక•పాలినే న, మో నమ యటంచుఁ గేలు మోడ్చి•మ్రొక్కి మఱియు.
సీ. కరవీరమల్లికా•కమలోత్పలములచే, రమణీయబిల్వద•ళములచేతఁ
గౌశికసాంబ్రాణి•కాధూపములచేత, ఘనసారచందనా•గరులచేత
సహకారకదళికాం•చత్ఫలంబులచేత, నవ్యరసాలదం•డములచేత
మహనీయశర్కరా•మధురసంబులచేతఁ, బ్రచురహిమాంబుపూ•రములచేత
తే. భవ్యగంగావినిర్మలాం•భస్సమేత, నారికేళోదకములచేఁ • జారువీటి
కా సద్వస్తువితతిచే • నాత్మఁ దద్ద, వేడుకలు మీఱఁ బూజఁ గా•వించి యంత. 44
క. నికటాగ్రసంస్థితుండై, ముకుళితకరకమలుఁ డగుచు • మ్రొగి నతఁడు మదిం
బ్రకటిమగుభక్తిఁ గందా, ష్టకమున నద్దేవు నిట్లు • సంస్తుతి చేసెన్. 45
కందాష్టకము. శ్రీమత్కలధౌతాచల, ధామ సుధాధామతిగ •ధామసమీర
వ్యోమాంబుయజ్వపావక, భూమహితాకార నన్నుఁ • బ్రోచి పింపు శివా. 46
క. శైల...తాలోల హృతా, ఖిలకృతాంతావలేప • పృథుకరుణాసం
శీలా తతహేలా , త, శూలా వ్రతమూల నీకు • జోహారు శివా. 47
క. యతిగణ్యామితపుణ్యా, న్వితఫణ్యాభరణ సతత•నిఃయుక్తాకృతప
ర్వతశృంగా ధృతగంగా, తతశృంగారాంగ నన్ను • దయఁ జూడు శివా. 48
క. నాగదదరపారదశర, శారదశరదభ కరితు•షారాభ్రస్ఫురి
తారాహితహీరా త, ధారాసితదేహ నీకు • దండంబు శివా. 49
క. కాలానలకీలావిల, హాలాహలభయవిచలిత•హరి శమహో
త్కోలాహలవేళాచల, లీలావిలసనుని నిన్ను • లెక్కింతు శివా. 50
క. హా కవరఘోటకపుర నాటకధర మణిభ•నవా ంబరగో
కో నవేటీఘున, జన మబ్బ న్ను • సేవింతు శివా. 51
క. మా పరభీమా పు , భామా రకంఠసూత్ర• ంగ మంచ
మాశ్రితవామా హ త,కామా క తకామ మాకు • గతి నీవె శివా. 52
. సు దా వవ మానవ, రమానవమం హాస• దనా మరు

గ్గిరిచాపా హరిరోపా, పరితాపాహరణ నిన్నె • ప్రణుతింతు శివా. 53

వ. అని మఱియును. 54

కందమణిగణనికరవృత్తము.

జయజయ పురహర • జయ గిరిశయనా, జయ తలవినిభృత•సదనులహారణా
నయగుణవిలసిత•నయశుభచయదా, జయ మునివరనుత•చరణసరసిజా. 55

సగర్భస్రగ్విణీభుజంగప్రయాతప్రుతవిలంబితవృత్తసీసము.

నిగమాశ్వభూసురా•నీకసంపూజ్యశుం, భత్ప్ర భావా వృష•పతితురంగ
సురుచిరద్యోసరి• ాట ఖద్యోతసా, హప్రభా సా సమ•స్తాఘహరణ
జగతీశ మాసర•స్వత్యబ్జమామాన్యచం, చత్కృపా నత•జనశరణ్య
మానితహాసర•మ్యాననాబ్జా లస, న్మంగళాత్మా నిశా•నాథమకుట
తే. హర సరీసృపహార భ•యాపహార, పురనిషూదన భూరిద•భూతిదాన
హరిహయప్రణతాచ్ఛప•దాంబుజాత, శరణు శంకర శాశ్వత • సాధుపాల. 56

సగర్భమత్తేభకందసీసము.

సమదవేదండని•శాచరోన్మథనభీ, మప్రోఘదోర్విక్ర•మా కృపాబ్ధి
ప్రముదితానేకసు•పర్వ నిర్మలగుణాం, భోధీ జగత్కా•రణా ధరేశ
లసదురోభాగవి•లంబితోరగపతీ, సామప్రియా శంక•రా మహాత్మ
ప్రపదరుగ్భూషిత•పాకజిన్మకుటశుం, భద్రత్న దివ్యప్ర•భా కపర్ది
తే. శివ నిఖిలలోకపాలన • భవవిదళన, శరధితూణ భయహర వి•జయ ప్రవిమల
హృదయ శశి ర త్రిభువన•హితసుచరిత, మితపుర తిజవరా ప్ర•శస్తకీర్తి. 57

క. అని యనివారితభక్తిం, బ్రణుతించి మహేశుకరుణ • వడసి డుణ్ణ్
నం బ్రాసాదము వెలు డి, జనవరుఁడు తదంతికమునఁ • జనియొడునెడ న్.

తే. స సనై ఖరిశ్రుతిపుటో•త వము మీఱ, నాలకింపంగఁబడియె న• ్యద్భుతముగ
సకలచేతనహృ యరం•జ మనో , మధురసంగీతరా ంబు • మలసి యెదుట. 59

క. ఆరవము విని పాగ్రణి, గా వపుంజెలిమికానిఁ • గనుఁగొని యహహా
చేరువ నొక ఒుసంగీ, తారవము విన గ నయ్యె • నల్లదె ంటే. 60

ఉ. కిన్నరకన్యలో సుర •గీద శలో గంుడాంబుజాతులో
పన్నగకాంతలో ఖచ •భామలో సిద్ధవధూటులో సుఖా
భ్యున్నతిఁ బాడఁ జొచ్చి రటఁ • బోయి దిటంబుగ వారిచందముల్
సన్నకసన్న నారసి వె•స న్మరలం జనుదెమ్ము నెచ్చెలీ. 61

క. వేమఱు మది కింపుగ గజ, గామిను లామనిగఁ బాడు•గానము వినుచున్
సోమరితనమునఁ దడయక, నేమంబున మరలి యిపుడె • చెచ్చెర రమ్మా. 62
ఉ. నావుడుఁ జెల్మికాఁడు నృప•నందను వీడ్కొని వేడ్క నేగి శ్రో
భావహలీలఁ గ్రాలునొక•యబ్బురపుంబువుఁదోఁటఁ జొచ్చి య
త్తావునఁ బ్రోవు గూడి వితతంబుగఁ గ్రీడ యొనర్చుదివ్యరా
జీవముఖీలలామములఁ • జిత్రగతిం బొడగాంచి వెండియున్. 63
మ. తరుమూలంబులపొంతఁ బొంచి సచివో•త్తంసంబు వీక్షించె భా
స్వరకార్తస్వరవిగ్రహ న్సమదచం•చచ్చంచరీకాలకన్
శరదిందుప్రతిమానచంద్రవదనం • జక్రస్తని న్విస్ఫుర
త్సరసీజాతదళాయతాక్షి నొకకాం•తాలోకచూడామణిన్. 64
తే. అట్లు వీక్షించి దానిస•మగ్రభువన
మోహనాకారరేఖ కా•మోద మంది
యహహ యియ్యిందువదన య•య సమశరుని
భూరిసామ్రాజ్యలక్ష్మి గాఁ•బోలు ధీర. 65
చ. కులుకుమిటారిగుబ్బలును • గొప్పపిఱుందును గావిమోవియుం
దెలినిడువాలుఁగన్నులును • నిండుముద్దుమొగంబు తళ్కుఁ జె
క్కులు జిలుఁగుం వు న్వెడఁ • గ్రొమ్ముడియుం గలయీచొకారపుం
గలి యలం జన ము • కన్నులపండువ యయ్యె నియ్యెడన్. 66
క. చూడమె ముజ్జ ములఁ గల, చేడియతలమానికములఁ • జెన్నలరెడునీ
వ్రీడావతీకదంబక, చూడామణివంటిదానిఁ • జూడ మొకందున్. 67
సీ. చందమామకు లోనఁ • గం దొన నతప్పు, పసిఁడికి దావిఁ గూ•ర్చనికొఱంత
దొండపంటికిఁ దీపి • నిండఁ యనికట్టు, తొగలఁ బెన్మడుగునఁ • ద్రోమవాడు
జక్కవపులుఁగుల • జత విప్పనాడిక, మించుటద్దముల మా•యించుకీడు
క తుం ములకు •క్ర యిడ్డ నేరమి, చివురులు గార్కొనఁ • జేయురవ్వ
తే. మలుపుకొనఁ జాలు నద్దిరా • జలజభవుఁడు, పూని యిమ్ముద్దుతలిరాకుఁ•బోఁడివదన
మరదాంశుకలోచన• స్తనకపోల, స పదయుగ కము సొం పె• ఁగ నొనర్చె. 68
సీ. పలుకులు నేర్చిన•తళుకుఁబుత్త బొమ్మ, జగతికి గ్గిన•చంద్రరేఖ
నిలుకడఁ గాంచిన•తొలు రిక్రొమ్మించు, తావి చేకుఱిన నె•త్తమి కెంపు
నెన్నడు పొదవిన•కన్నెమామి గున్న, తను పూని మెలఁగుకెం•దమ్మికొలను

నగవుఁజూపులవడ్డి సొగసుఁగ్రొన్ననచెండు, చేష్ట లబ్బి మెలంగు చిత్రరేఖ

తే. గావలయు నియ్యబల దీని గాఢకాంతి, రూపలావణ్యశుభవైఖరులు గరంబు
నమ్మహారాజునకుఁ దెల్పి యతిరయంబ, తోడుకొని వత్తు నని వేడ్క తోడ మరలె.

తే. మరలి చనుదెంచి యమ్మహీ వరుని గాంచి, యంచితాలాపముల నిట్టు లంచుఁ బలికె
భూతలాధీశ నీయాజ్ఞఁ బూని యిందుఁ, దరలి యొకయబ్బురపుఁద్రోవ నరిగియవల.

సీ. పటికంపుదోనులఁ బరఁగు గో ంగపూ, నీటిబల్లక్కర ల్దాఁటి దాఁటి
గుప్పుగుప్పునఁ దావు లుప్ప ఁగఁద్రోవ, నెలయుకప్రపుఁ ప్ప లెక్కి యెక్కి
గాటంపునెఱపూఁత కమ్మసం గిచె , డల నంతం నిలిచి నిలిచి
య గ బ్రాఁకి యెల్లతావుల బెం, మీఱునెలకిపొద ల్దూటి తూటి

తే. తెమ్మ మ్మఁగఁ గడు నెడ తెగక కురియు
సరిద విరిదేనెసోనలఁ బొరసి పొరసి
యొఱపులకు నెల్ల నిక్క యై వఱలునొక్క
మేటిచెలువంపువలిపువ్వుఁ దోఁటఁ గంటి. 71

సీ. రామనామస్తుతిఁ గ్రాలి ఫలాహార, వృత్తిఁ జరించు శుకేంద్రములును
నీలకంఠాకృతి నెఱపుచు నానంద, తాండవం బాడుచంద్రకిచయంబు
నమృతాశయంబునఁ గమలజాన్వేషణే, చ్ఛఁ జెలంగుపరమహంసవ్రజంబు
వనములఁ బడి మాధవప్రసాదముఁ గోరు, కృష్ణవేషద్విజబృందములును

తే. సతతవివిధాగమాంతవా సనలవలన, నాద మెఱిఁగి నిరంతరామోదలీల
న రుసిద్ధాళులును గల్గి యవ్వనంబు, గనుఁగొ ఁగ నబ్బ మొదవించుఁ గద నృపాల.

క. ఆ లావనమున ఘన, హేలామా మునఁ జెలఁ యిమ్ముగ సుమనః
కే రతి నలరారెడు, బాలారత్నములఁ గంటి భా జరూపా. 73

ఉ. ఆమహిళాలలామముల యందు రహి బొ గంటి వ్యశో
భామృదుతాసుగంధపరి భా తరూప లాస లక్ష్
వేమఱు గోము మీఱి యర విందశర సనుచే వెలుంగుక్రొ
మ్మామిడి ందువంటియొక మత్తమతంగజ ాజగామినిన్. 74

ఉ. ఆ మెలనాగసోయగ మ యారె గణిం నోకించు కైన న
త్తోయజనూతిసృష్టిఁ గల తోయరుహా నలందుఁ జెంద ద
క్కాయజుఁ డబ్బురంబుగ జగంబులు గెల్వఁగ నేర్చి యిడ్డనుక్
జాయకటా గావఁ యుఁ జామ నిఁ కేమని యెంతు భూవరా. 75

సీ. కలికిబంగరుబొమ్మ • గాఁబోలుఁ గాకున్నఁ, బరులనెమ్మది కాస•పఱుపఁ గలదె
కల్కితొల్కరిమించు•గాఁబోలుఁ గాకున్న, నెఱయఁ దళుక్కని • మెఱయఁ గలదె
కన్నెగేదఁగిపూవు • గాఁబోలుఁ గాకున్న, జిలిబిలివలపులు • చిలుకఁ గలదె
కడిఁదివెన్నెలనిగ్గు • గాఁబోలుఁ గాకున్నఁ, గువలయామోదంబు • గూర్పఁ గలదె
తే. మేలినెత్తమ్మికొలను గాఁ•బోలుఁ గాక, యున్నశృంగారరసయుక్తి • నొనరఁ గలదె
యహహ మనుజేశ మదసమా•యాకిరాత, ముక్తలీలాకురంగి యీ•మోహనాంగి. 76

సీ. కలికిబిత్తరివాలు•తళుక్కుఁజూపులసౌరు, హరిణీవిలాసంబు • పరిభవించుఁ
బడఁతియబ్బురపుఁబెం•దొడలనిగారింపు, రంభాపటుత్వంబు•రవలి గెల్చుఁ
గొమ్మని ఘనముద్దు•నెమ్మొగంబు హొరంగు, చంద్రరేఖాస్ఫూర్తిఁ • జౌకసేయుఁ
జానవాఁడెంపును•నే నిచోకాటంబు, హేమాతిశయలీల • నెగ్గులెన్ను
తే. సారసామోదసార శృం•గారగరిమ, చిత్రరేఖాశుభాకృతిఁ • జిన్నపుచ్చు
భళిర యూలేమ దేవతా•భామ యేమొ, కాక యయ్యంద మిఁక నెందుఁ•గలదు భువిని.

సీ. కలకంఠిజఘనంబు • కాంచికాస్థానంబు, మధురా[illegible]తలి • మగువమోవి
యన్నులమిన్న పం•దాగ్రంబు కూర్మంబు, పడఁతుక[illegible]గ్గునెం•న్నడుము మాయ
నీలజీమూతంబు • నెలఁతధమ్మి[illegible]ంబు, రాకేందుముఖిరోమ•రాజి కాశి
నలినలోచననిమ్న•నాభి కేదా[illegible]ంబు, భామచన్దోయి శ్రీ•పర్వతంబు
తే. గాఁగనృపచంద్ర సుక్షేత్ర•గరిమనెపుడుఁ, జెలఁగుచున్నది దాని భ•జింపఁ గలుగు
పరమపురుషున కత్యంత•భాసమాన, నిరుపమానందసంసి[illegible] • దొరకకున్నె. 78

సీ. అతివచెక్కులు గొప్పు • నబ్దంబుల హసించుఁ, బదములు గళము నం•బుజముల మించుఁ
బొలఁతినాభియుఁ గుచం•బులుఁ జక్రములఁ గేరుఁ, గమనంబు నారు నా•గముల మీఱు
సతిమొగంబును న[illegible] • జంద్ర[illegible]గణ నేలుఁ, దనుదుచు ల్వలపుఁ కాం•చనముఁబోలు
నువిదచూపుఁబిఱుంఁదుఁ•గువలయంబు జయించు, రదనముల్ గొను హీ•రముల నెంచు
తే. నధిప యయ్యన్నుమిన్న సౌ•యగముఁ గన్న, ననిలసలిలచ్ఛదాహారు • లగుచు వనులఁ
ద[illegible] గృశియి చుజడదారి•పెద్దలైఁ, దాలిమంతయుఁ దూ[illegible] పి•రాలిఁ గొనరె. 79

వ. మఱియును. 80

ఉ. చేరిక నెంత రాజుచె • చెంగట వ్రేలుచు నున్ననీలముల్
కోరిక నచ్చకోర[illegible] •క్రొవ్విదసా[illegible] ముఁ జె ద నేర్చునే
యూర సారెకు అయుం•చు డుమ్మధువ కోటు లెంత ఝుం
కారము చూపిన ద్ది ర • గామిని వే లిఁ బో నేర్చునే. 81

క. ఘనమొకటఱి నొక్కొకదీ, తక్కన వృష్టి యొనర్చుఁ గాని • కోమలి తులఁ మఱి
ఘనము ఘనమగుచు నెల్లెడఁ, గొనకొని శృంగారరసమే • గురియు నృపాలా. 82

తే. ఉవిద నెమ్మోముదమ్మికి • నోడి క్రుక్కి, తద్విరోధంబు సాధింపఁ • దలఁచెఁ గాక
జనులకెల్లను గడుఁ జల్లఁ•దనముఁ జూపు, తొగలఱేఁ డబ్జముల కేల • పగతుఁ డయ్యె.

క. అంగన కన్బొమకవతో, సింగిణు లెదిరించి గెలుపు • చేకుఱ కవనిన్
వంగి శరమూని కడు నా, ర్తిం గొఱలుచు నుండెఁ జుము • నృపకులతిలకా. 8

క. అచ్చానినాసతోడను, జిచ్చపడక మొనసి తుదిని • తేఁక   వడిన్
విచ్చెం జంపకముకుళము, చెచ్చెర మఱి నువ్వుఁబువ్వు • స్నేహం బూనెన్. 85

క. అప్పొలఁతికన్ను లందము, తప్పక కన్గొనుచు నుండి • తగ బేడిసమీ
ల   డు నత్తెఱఁగలవడ, అప్పలు మోడుపక యుండె • నేపు నా పున్. 86

తే. మీలు మే లోర్వ లేకెంత • మిట్టిపడిన, నేణము ల్ప్రాణమైనెంత • యెగిరిపడినఁ
దూపు లేపార నిల నెంత • తూలిపడినఁ, జెలువనిడువాలుచూపుల• గెలువఁ గలవె. 87

క. మఱి మఱియుఁ దోమి తోమియు, మెఱుఁగిడక వెలుంగ కుండు•మృదుదర్పణముల్
తెఱవనునుఁజెక్కుఁగవ కెత్తెఱఁగున నెన వచ్చు వసుమ•తీవరచంద్రా. 88

క. తామరసనేత్రవీనుల, తో మొనసి జయింప లేక • త్రొక్కటమున నెం
తే మలకలఁ బడి స్రుక్కుచు, వేమఱు శష్కులులు గ్రాఁగి • వేఁగుచునుండున్. 89

సీ. ననఁబోఁడియధరంబు•నకు సాటిగా కేమొ, బంధుజీవకము ని• ంధ మయ్యెఁ
దెఱవ మెఱుంగువా•తెఱ కుద్ది గా కేమొ, కురువిందమణి త్రాస•గుణము గానెఁ
బొలఁతిరదచ్ఛదం•బున కెన గా కేమొ, కఱకూని చిగురాకు • కారు పాఱె
శుకవాణిముద్దుమో•వికి జోక గా కేమొ, సడలి బింబఫలంబు • చప్పఁబడియె

తే. నంబుజేక్షణచక్కెర•కెంపుఁబెదవికి, నీడు గా కేమొ విద్రుమం • బెల్ల ప్రొద్దు
గ్రామనుపడి యుండె నయ్యారె • మాట లేటికి, కన్నుదలమిన్న సోయగం • బెన్న నరిది.

క. చిగురాకుఁబోఁడినునుఁగ్రొం, జిగిబిగిపలుచాల్పు దొడరి • సేమంబున గె
ల్పు గొనం జాలక యెపుడును, మగరాల్జగడాలు పూని • మట్టం గ్రాలెన్. 91

తే. లేమగళమున కు గా • లేక యోడి, సుడివడుచు లోన బిగి చె  • యడుగు పట్టి
దరము దరమూని మొర సేయ• దానికిపుడు, దర మనెడుపేరు విడువక •తవిలియుండె.

తే. రతిమనోభవకేలికా• రామసీమఁ, బొదలు వమూతలతలు గాఁ•బోలు దాని
బాహులత లట్లు గా కున్నఁ • బాణిపల్లవములు రాజిల నే   నే • వానితుదల.

సీ. పట్టినప్పుడె కందె • పస దప్పి కడుమెత్తఁ, బా టూనుకొన్నని•బంతు లెనయె

పట్టి నబ్బక రెచ్చి • పాటి జో డెడవాసి, కలఁగెడుకొదమజ•క్కవలు తులమె
పట్టి నొక్కిన శిలా•పాళియంబు లై నను, గోరు నాటక యుండు•కొండ లీడె
పట్టి రాచినయంత • బలువన్నియల గరం, గెడుమేటిజాళువా•గిండ్లు సరియె
తే. పట్టఁ బట్టఁగఁ దిరుగుడు•పడుచు నుండు, మేలిరతనంపుపలుబొంగ•రాలు దొరయె
యహహ ధరణీశ యత్తలి•రాకుఁబోఁడి, కులుకుసిబ్బెంపువలిగబ్బి•గుబ్బకవకు. 94

క. నీలాహి యనుచుఁ దుమ్మెద, చా లనుచు న్నల్లచీమ•చా లనుచు జనుల్
తోలుదురు గాని చెలిరో, మాళి ప్రజ న్గెలుచుమురుని•యసిధార సుమీ. 95

తే. చంపకామోదవళుల జ•యింపఁ బూని, యేటితరగలు పెల్లున • నెగసి తద్దఁ
బెరిగి విఱుగుచు నుండె ని•ద్ధరణిలోన, నరయ జడభావులతెఱంగు • లట్లు కావె.

క. సుడివడి కలఁగుచు స్రుక్కెడు, మడుఁగులు చెలినాభిపోల్ప • మాదిరి యగునే
య వుల బొ౦ౘ బు వెట్టుచు, నడలెడుహరు లింత్రికొను•నాకృతిఁ గనునే. 97

క. తరు మణి ఘ మునకు, దొర గాక తృణంబు వూని • తుద లేక వసుం
ర యొడితొడుసలఁ బ మహి, దరములు చుట్టుపక్షితావు • దరలక యుండెన్.

తే. పొలఁతియూరుద్వయంబుతోఁ • బోరి మున్ను
గెల్వ గొన లేక పొర యూని • దళము లెలయఁ
గాచి యుండియు గెలఁ జేవ • గలుగకుంట
నంటులకు నెల్లఁ దలవంపు • లయ్యెఁ జుమ్మి. 99

• లలనామణిపిఱుఁదులతోఁ, దుల యగుభ్రమ నుఱుక దిరుగఁ • దొడఁగె రథాంగం
బులు మఱియుఁ గుప్ప వడుచుం, బులినంబులు మెత్తఁబాటుఁ • బూనెం జుమ్మీ.

తే. కలమగర ంబులో మహో•త్పల ళాక్షి, క్కలకు నోడి తద్దయుఁ • బీఁకెపాటి
వెన్ను చూపి తృణం బూని • యెన్న రాని, నానఁ దలవంచుచుండె న•నాగతంబు.

తే. పా ఁతిమీఁగాళ్లతో నెనఁ•బోలలేని, మోస మొదవిన వంతులు • మునిఁగి మునిఁగి
మా మాటికి మేటితాఁ•బేటిదాఁటు, గుట్టు చెడి పొట్టలోఁ దలఁ•గ్రుక్కుకొ మె.

చ. గమ ప ద•యంబుసరి • రా నెదఁ గోరి యనేకకల్పముల్
కమ ము క తగాత్రగత • గాఁగ జలంబుల నర్క వేఁడి యం
దమిత భాసుగంధ దు•తామలతల్ కమలాకరత్వముం
గమలభవాస్ప త్వమును • గాంచి తదంఘు లఁ బోల దింతయున్. 103

తే. జలరుహోత్కుణ దనఖ •బు ను బోలఁ, జాల కెం యు రిక్కచా • ల్చెలపడియెఁ
గర ములకుఁ గే కీ• . శము, లో కంటకభావంబు • వీడ కుండె. 104

తే. బాలతనుకాంతితోఁ సాటి • పోలఁ గోరి, పృథ్వి ననలప్రవేశంబు • పెక్కుమాఱ్లు
చేసి యొఱపులఁబడెఁ గాని • వీస మైనఁ, బోలఁగాఁ జాల దయ్యె జాం•బూనదంబు.
సీ. వ్యాళము ల్దల వంచి • నేలఁ జొగిలఁబడెఁ, బూని నీలపురాలు • పూరిఁ గఱచె
నద్రులు పాదంబు • లాడక పడియుండె, వాలెంబు నేనుఁగుల్ • గేలు మోడ్చె
బెదరి చూచుచు లేళ్లు • చెదరి పాఱఁ దొడంగె, నీరజంబులు లోఁతు•నీటఁ బడియెఁ
గోయిలమూఁకలు • గొదకొని చెట్లెక్కె, సింగముల్ గుహల న•డంగి డాఁగె
తే. నవనినాయక నిఖిలలో•కాద్భుతాభి, నవవిలాసవిభ్రమము•న్నఁ దనర్చు
కలికిరోమాళికచకుచ•గమననయన, ముఖవచోమధురములతోడ • మొనసి యోడి. 106
మ. పలుకు ల్వేయు నిఁకేల భూరమణ యా•బంగారు ల్బొమ్మ యా
వలికప్రంపుటనంటిక్రొమ్మొలక యా•వాల్గంటి యాశ్యామ యా
యలివేణీజనమాళికాభరణ మ•య్యంభోజపత్రాక్షి యా
తలిరుంబ్రాయపుఁగల్కి రాచిలుక యా•తన్వంగి నీకే తగున్. 107
క. అని సంగడికాఁ డెఱిఁగిం, చిన విని యత్యంతముదిత•చిత్తుం డగుచున్
జనవరుఁ డటఁ దరలి రయం, బునఁ జనియె వధూటిఁ జూచు•బులు పెదఁ బొదలన్.
క. చని చని వని వనితం బెనఁ, గొన మోహం బంతకంత•కు న నమున నూ
ల్కొన నజ్జనప సఖునిం, గనుఁగొని యిట్లనియె నర్మ•గరము గాఁగన్. 109
చ. కనుఁగొను సంగడా వన•కన్యకుఁ గాలభుజంగుఁ డిడ్డనూ
తననఖరేఖలో యనఁగఁ • దద్దయు మోదుగమొ లొప్పెడిన్
జనవర నీవు నవ్వికచ•సారసలోచనగుబ్బదోయిపై
దనరునఖాంకురాంకములు • దద్దయు నించెదు కూర్మి మీఱఁగన్. 110
తే. అఱుగుత్తులపై వ్రాలి • యదె మరంద, మానుచున్నది మగతేఁటి • యనఁగ చూడు
సామి యాలేమకుచగుళు•చ్ఛములమీఁద, వ్రాలి కెమ్మోవి తేనియ • గ్రోలె దీవు.
క. చెలికాఁడ గండుఁగోయిల, నలిఁ గొందలిరాకు గం ట్లొ•నర్చెడుఁ గల
భళిభళి యచ్చెలివాతెఱఁ, బలుగం ట్లొనరించె దీవుఁ • బ్రమదమున పా. 112
క. పున్నాగముతోఁ బెనఁగొను, చున్న లతకూన చూడు • మోహలో ఖుఁడా
పున్నాగము తో న, చ్చిన్నెలక్రొం గఁగ్రోఁడి • చెలిమిఁ బెనంగున్. 113
చ. పలుమఱుఁ దదంపతులు • భావభవప్రసక్రియారతిన్
మెలఁగుచు మింటిదాఁకఁ బొద•మి యఁ గేరెడుఁ జూడు నెచ్చెలీ
భళిభళి రాజచంద్ర యల•పంకజపత్రవిశాలలోచనం

గలసి సువర్ణగేహమునఁ • గామసుఖోన్నతిఁ గేరె దీవిఁకన్. 114

క. కప్పురపుబూది పైపైఁ, గప్పుచు నున్నది యనంటిఁ • గనుఁగొనుము సఖా
యప్పొలఁతి సుగతవేళలఁ, గప్పను నీమేన వలపుఁ • గప్పుర మధిపా. 115

క. కలరవ మదె యింపుగఁ, బలుకుచు నున్నయది చూడు•ప్రాణసఖా నీ
గలసి రతి నీవేళల, గళరవ మొనరించు నట్లు • కలికి నృపాలా. 116

క. పలుమఱుఁ బూఁదేనెలు మెయిఁ, జిలికెడు నిదె చూడు పొగడ • చెలికాఁడ మహీ
తలనాథ నీపయిన్ హిమ, జలపూగం బిట్లు లలన • చల్లెడుఁ జుమ్మీ. 117

క. లికుచము లివె చూడుము కే, లికి సొం పొనరింపఁ జాఁగె • లీలాసఖుఁడా
యెకిమీఁడ యల్ల జవరా, లికుచంబులు నిట్టు లలరు•లే నీచేతన్. 118

తే. హరిణి నల్లదె కాంచు మో•య్యన వయస్య, పట్ట నబ్బక వడి లేచి • పఱచుచున్న
దహహ ధరణీశ యమ్మనో•హరవిలాస, హరిణి నీ కబ్బుగఁ జేతి • కబ్బుఁ జుమ్మ.

తే. అనుచు నర్మోక్తు లాడుచు • నవనిజాని, వనపదవినోదములు గనుం•గొనుచు నుండె
ననిన విని దేవముని నల్వ•నవలికతయుఁ, దెలుపవే యని తవిలి ప్రా•ర్థించు మటఁనుడును.

మ. దళితారాతినిశాట భాసురవియ•ద్గంగాజటాజూట మం
జులరాజ్ఞాకిరీట ఘోరసమర•క్షోణీనిరాఘాట ని
స్తులవేదత్రయఘోట పాణితమహా•దోషాటవీర్ఘూట ని
ర్మలధౌతాచలకూట దుష్టపటభు• గ్విమ్యత్పురోఘాటనా. 121

క. డిండీరపుండరీకా, ఖండలశుండాలచంద్ర•ఖండపయశ్శ్రీ
ఖండాఖండయశోవృత, కుండలిమండలవిభూష•కుక్కుటవేషా. 122

మాలిని. కథితశుభచరిత్రా • గ్రావకన్యాకళత్రా
మథితవిమతగోత్రా • మానిసంస్తోత్రపాత్రా
ప్రథనదితిజజైత్రా • భక్తచిత్తాబ్జమిత్రా
పృథులధవళగాత్రా • భీకరోగ్రాగ్నినేత్రా. 123

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వరకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగానామాత్యపుత్త్ర కలసంస్కృతాంధ్ర లక్షణకళాకౌశలాభిరామతిమ్మకవిసార్వభౌమప్రణీతం బగు రసికజనమనోభిరామం బను శృంగారరసప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# రసికజనమనోభిరామము

## తృతీయాశ్వాసము.



లలితవృషతురంగా

శైలసుతాసంగ కలశజలధినిషంగా

కాలోన్మదభంగా ధృత

హేలాసారంగ కుక్కుటేశ్వరలింగా. 1

తే. అవధరింపుము సురమౌని క గ , డవలికత దెల్పఁ బూని యిట్లనుచుఁ బలికె
నట్లు వనవీథిఁ దిరుగుచు నరి న్పతి, యక్కజంబుగ ముందఱ నొక్కచోట. 2

సీ. గుజ్జులమావిమ్రాఁకుల నంటిఁ బ్రాఁకిన, పరువంపుదాఁకపందిరులదరులఁ
జలువచెంగలువబావులక్రేవ జా ను, వలపుగొ ఁగినీటివంతచెంతఁ
బ్రోదికప్రపనంటిబోదెచాలుప్రమోలఁ, బొరలు ఁదేనెజక్కగలప
మొల్లంపుఁదావు లీన్మల్లెక్రొన్ననతీవ, వెసగొన్నగున్నసంపెగలనీ

తే. మెఱుఁగుచందురురానిగ్గుటరఁగుమీఁద, నీటుగా గోర వీణియ మీటుకొనుచు
బోటులను గూడి జిలిబిలిపాటఁ బాడు, చున్నయెలజ నప్రటన్నుమిన్నఁ గనియె.

చ. కని యెన లేనివేడ్క లెదఁ గ్రమ్మఁగ నమ్మగమిన్న మిన్నకా
వనజదళాక్షి చెంత కనివారణఁ జేరి జగ నానురం
జన మొనగూర్చుదానివిలసన్మ దుగాన థాప్రశస్తి కా
త్మను గడు సోలి యిట్లను ము ంబున నబ్బురముం బెనంగొనన్. 4

. సగససారంగాతిశయనిరూఢిఁ దనర్చెఁ, బొలఁతివాల్చూపులు పొలుపు మీఱి
లాలితగతిని వరాళివైఖరిఁ బొల్చెఁ, బల్లవపాణిధమ్మి గరిమ
శంకరాభరణంబుసౌష్ఠవంబును మించె, భామినీగత్నంబురోమరాజి
రహిని బున్నాగాభిరామలీల నెసంగె, నీలనీలాలకనిమ్న నాభి

తే. యహహా యీచాన గానవి•ద్యావిధాన
మునఁ జెలఁగి రాగ మొనగూర్చు • చోనరె దీనిఁ
గన్న మృగఖగ పన్న గా•గమము లెలమి
నుల్ల సిల్లవె యని సోలు • చున్న యెడల. 5

క. అచలావల్లభుఁ గనుఁగొని, సచివగ్రామణి నితాంత•సంతోషరస
ప్రచురత నెమ్మదిఁ బొదువఁగ, వచియించెన్ హితమృదూక్తి•వైఖరి మెఱయన్. 6

మ. తలుకార్శ్మల్మి పసిండిబొమ్మకగణికిన్ • దట్టంపు నెమ్మేనిచా
యలు నల్దిక్కులఁ గ్రమ్మి పర్వఁగ వయః•స్యామధ్యభాగంబునం
బలుకుంగిన్న రవీణె మీటుచుఁ గథా•ప్రాగల్భ్యము ల్చూపుని
కల్కులకంఠీజనమౌళికాభరణముం • గంటే నృపాలాగ్రణీ. 7

చ. ఉవిదవయోవిలాసవిభ•వోజ్జ్వలరూపకళా ప్రచారముల్
తవిలినవేడ్క నీకు వితతంబుగ మున్నె ఱిఁగించితిం గదా
ప్రవిమలలీల నీ విపుడు • బద్మముఖిం గనుఁగొంటివే కదా
యవనితలేంద్ర నావచన • మాత్మఁ దలంచిన నిక్కమే కదా. 8

ఉ. కోరిమి మీఱ నవ్వికచ•కోమలతామరసాయతాక్షి నిన్
గోరి వరించెనేని యిదుఁ•గో పదియాఱవవన్నె మేల్మిబం
గారముతోడ దివ్యతర•కాంతిసముల్లసదబ్జరాగముం
గూర్చిన సుమ్ము నృప•కుంజ మాటలు వేయు నేటికిన్. 9

చ. పలుకుల మిభూపకుల•పావన యౌవనరాశివేష్టితా
చలఁ గల బల్పొలంతుకల • సారెకుఁ గన్గొనుచుందుమే కదా
శిథిళి యొందునేని యొక•పట్టున నీభువనైకమోహనో
జ్జ్వలలలితాంగివంటి నెఱ•చందపుఁగల్కులు మీటారిఁ గంటిమే. 10

తే. క జముఖి నీమనోహరా•కారరేఖ, మంజుగతిఁ గన్గొనియె నేని • మదనవిశిఖ
పుంజనిష్పీడ్యమానుడై•పొదలి యాత , రంజిలుచునిన్నుఁ గవయుఁ బో• రాజచంద్ర

వ. అనిన నాసచివగ్రామణికి నృపాలాగ్ర యి ట్లనియె. 1

సీ. అ రా యీచిన్ని•ముద్దుగ్రొన్ననఁబోఁడి, కలికిని ంపుఁగ్రొ•క్కారు మెఱుఁగు
మెఱుఁగుగా దిది యల్ల • చెఱకువిల్దొరచే , కడి దినెత్తావిచెం•గలువదండ
దండగా దిది నలఁ • దంట న బేసు, పడ నొనచ మేలి •పసిఁడిబొమ్మ
బొమ్మ గా ది గం•బుల కెల్ల మిన్న యై, సొంపారుబలుమాని•కంపుఁదొడవు

తే. తోడవు గా దిది వలరాచ•పడఁతిమిన్న, వలను గా నిడ్డ శృంగార•వనములోన
మలయు నెఱపూఁతగుజ్జులే•మావి మోక, యహహ వనజాస్యఁబొగడ శ•క్య మెవయస్య.
ఉ. అందని మ్రానుపండులకు • నాస వహించినరీతి దివ్యసం
క్రందనపట్టణద్విరద•గామినిపొం దెదఁ గోరి వేడ్కమై
నిండుల కేగుదెంచుట కొ•కించుక నెయ్య మెలర్ప నీజగ
త్సౌందరి దా ననుం గవయఁ • జూచునొ లేదొ కదా సుహృద్వరా. 14
ఉ. కన్నియ వన్నియ ల్బెరయఁ • గ్రన్నన నన్నవిల్తుకేళికిన్
నన్నెన లేనికూర్మి మది • నాటుకొనం గవకూడ కున్నచోఁ
గ్రొన్నెలవెన్నెల న్సమద•కోకిలకాకలికారవంబులం
జెన్నటి యెన్నిబన్నములఁ • జెందఁగఁ గూడునొ యేమి సేయుదున్. 15
ఆ. అని వచించి యిర్వు•రును దమ కొకతూరి, చనిన నవ్విశాల•జలజనయన
సిగ్గసంగ నెచట • దిగ్గన జరుగునొ, యనుచుఁ దలఁచి మరల • నతని కనియె.
ఆ. చెలిమికాఁడ నీవు • వల నొప్ప ముంగలఁ, జని కడంకతోన • యనుఁగుఁజెలులఁ
గూడి క్రీడ సేయు•చేడెల తలమిన్నఁ, గాంచి వేగ దాని•కరుణ వడసి. 17
క. తిన్ననిజిలిబిలిపలుకులఁ, గన్నియ డెందంబు మిగులఁ • గరఁగింపుచు నీ
వున్నయెడ న్నెనచటికి, సన్నకసన్నన్ రయంబ • చనుదెంతుఁ జుమీ. 18
శా. ఏచందంబున నింతిచెంత కఱలే • కీ వేగి దర్శించెదో
యేచందంబున మాటలాడి మదిలో • నింపొందఁగాఁ జేసెదో
యాచంద్రాననపొందు నా కెటువలెన్ • హత్తించెదో మేలు నీ
వాచాప్రౌఢిమ నేఁడు చూతము గదా • బాలేందులీలాసఖా. 19
తే. అని యతని వీడుకొల్పి య•జ్జనవిభుండు
గోర్కెదైవార నొకచోటఁ • గూరుచుండె
నృపసఖుండును వేల్పుఁగ•న్నియలచెంత
క్రమముగ నేగి నిలుచున్న•యవసరమున. 20
ఉ. సామజరాజకుంభవిల•సత్కుచకుంభభరానతాంగులై
నేమ మెలర్ప లేచి యత•నిం బ్రియమారఁగఁ జూచి భూరిసు
త్రామమణిప్రభావళివి•రాజితదివ్యసువర్ణపీఠికం
దామరసాంఘ్రితాక్షులు ము•దంబున నిల్పిరి రాజదూతునిన్. 21
వ. అట్లు గూ ండంజేసి యున్నసమయంబున. 22

సీ. నీలంపుగాజుల • నెఱిమించుపచ్చల, కీలుకడెంబు డా•కేలు మెఱుఁగు
వలిగబ్బిగుబ్బచ•న్గైలనికిఁ దార్చుచు, సొలపుఁ గ్రేఁగంటివా•లూపు లలరఁ
జిన్నారి తెలినవ్వు•చెక్కుటద్దములు తే, వెన్నెలనిగ్గుల•విధ మొనర్పఁ
గమ్మచక్కెరపాన•కమ్ము లిమ్ముగఁ గ్రమ్మ, ముద్దునిద్దంపుకె•మ్మోవి గదలఁ
తే. గలికి యారాచనెచ్చెలిఁ • గని నయమ్మె, నయ వసంతాగమారంభ•నవరసాల
కిసలయగ్రాసమత్తకో•కిలవధూస, మంచితాలాపముల నిట్టు • లనుచుఁ బలికె. 23
ఉ. ఎచ్చట నుండి యెచ్చటికి • నేగద వెవ్వరివాఁడ విచ్చమై
నిచ్చటి కేగుదేరఁ బని • యెయ్యది నీవు వసించునున్కిప
ట్టెచ్చట నిన్ను నేలుమను•జేశ్వరుఁ డెవ్వఁడు దప్ప కిన్నియుం
జెచ్చెరగ నింక మాకెఱుఁగఁ • యుము మాటలు వేయు నేటికిన్. 24
చ. అన విని రాచదూత విన•యమ్మున నమ్మధురాధరోష్ఠిఁ గ
న్గొని యనియె న్సరోజదళ•కోమలచారుశరీర యేను స
జ్జనపరిపాలనప్రథిత•సారగుణాకరుఁ డై సమున్నతిన్
దనరుబుతుధ్వజప్రభువ•తంసముగారవపున్వయస్యుఁడన్. 25
క. పేరు మతిమంతుఁ డం డ్రీ, ధారుణిఁ గల్యాణపురము • తరుణీమణి మా
యూరిచటికి వేఁటకు నా, భూరమణుఁడు సేనఁ గూడి • పొలుపుగ వచ్చెన్.
ఆ. వ  కొంతతడవు • వనవిహారము సల్పి, యున్న గ్రామమున మ•హేశుఁ గొల్చి
చనుచు నీవిచిత్ర•సంగీతనాదంబు, వీను లలర నిపుడు • విని చెలంగి. 27
ఆ. నిన్నుఁ జూచి వేడ్క • నివటిల్లఁగఁ గొన్ని, మాట లాడి చనఁగ • మదిఁ దలంచి
వచ్చుచున్నవాఁడు • వనజా . మారాజు, మునుపడంగ నన్నుఁ • బనిచె నిటకు. 28
క. ఆపృథ్వీవరకుంజరు, రూపవయఃప్రాభవములు • రూఢిగ నీ విం
దేపారఁ జూచి మదిలో, నోపైదలి యరిది వేడ్క • నొందెదు సుమ్మీ. 29
శా. ఓరాజీవదళేక్షణాజనమణీ • యోవాక్సుధాధోగణీ
యోరాకామిహిరాకరోజ్జ్వలముఖీ • యోగానవిద్యానిధీ
యోరోలంబకదంబలంబకబ • యోభవ దివ్యాకృతీ
మారాజ మహేంద్రుసొంపు వినుతిం• క్యమే యేరికిన్ 30
మ. తరుణాంభోజదళాయతాక్షి వినుమా • తథ్యంబు నామాట
న్నరగం ర్వ లింపమర్త్యవరుల • న్నాక్రువ్వఁగా నేల యా
సరసాగ్రేసరుసోయగంబు దెగడం • జాలు న్వసంతు న్నటుం

బురుహూతప్రభవస్మరైలబిలతుఁ • బూరూరవసోమ్ములన్. 31

ఉ. ఇంచుకసేపులోన జగ • మెల్ల వెలుంగఁగఁ జేయుతేజుచేఁ
బంచశరోపమానుఁ డగు • పావకశేఖరుఁ డిందు వచ్చినం
గాంచి మనోనురాగమునఁ గామిను లెల్లఁ గరంగి పాఱఁగాఁ
జంచలనేత్ర నాపలుకు • సత్యముగా నపు డాత్మ నెంచుమా. 32

ఉ. చెప్పెడి దేమి యానృపతి • శేఖరుఁ జక్కఁదనంబు కన్నులం
దప్పక చూచి రేని పటు • దర్పకఘోరశిలీముఖార్తలై
యొప్పులకుప్ప లైనగరు • డోరగయక్షసుపర్వకన్యలున్
ముప్పిరిఁ గొన్న మోహమున • ముద్దియ తద్ద చలింప కుందురే. 33

క. చనఁ బూని యొక్కపలు కే, ననఁ బూనిన నెచటఁ గోప • మగునో యని లో
ననుమానించెద నైన, న్వినుమా నావిన్నపంబు • వికచాబ్జముఖీ. 34

మ. విమలాంగీతతుల న్మహాకృతుల ము • న్వీక్షింపమో తత్ప్రకా
రము లెల్లం బరికింపమో యహహ యే • రాజాస్యలం దైన నీ
రమణీయోజ్జ్వలరూపవిభ్రమకళా • ప్రాగల్భ్యముల్ గంటిమే
రమణీ సంతతసంశ్రితామ మణీ • రామాజనగ్రామణీ. 35

క. తలుకారుకుందసుమతోఁ, దొలుకారుమెఱుంగుఁదీఁగె • తోఁ బల యగునీ
చెలువంపుమేని కారా, నెలపొం దలవడక యున్న • నిష్ఫలము గదా. 36

తే. వెలఁది నీరూపలావణ్య • విభ్రమముల, కమ్మహారాజుతోఁ జెల్మి • యబ్బెనేని
కోరి పదియాఱువన్నె బం • గారుతోడఁ, బద్మరాగంబుఁ గూర్చిన • పగిదిఁ జువ్వె. 37

క. బంధురతేజస్సరసిజ, బంధుఁడు గుణసింధుఁ డగుచుఁ • బరఁగెడుభూభృ
ద్గంధగజేంద్రము నిప్పుడు, గాంధర్వవివాహమునను • గైకొను మబలా. 38

చ. పలుకులు వేయు నేటికిఁక • భావభవప్రతిమానుఁ డైనయా
చెలువునితోడుతం జెలిమి • చేకుఱ కున్న నయారె నీమెయిం
గలయలజవ్వనం బడవిఁ • గాచినవెన్నెలసుమ్మ ముద్దులేఁ
జిలుకలకొల్కి నాపలుకు • చిత్తమునం దలపోసి చూడుమా. 39

సీ. కనకంబునకుఁ దావి • గలుగంగఁ జేయక, పిల్లిగడ్డలకుఁ గ • ల్పించినట్లు
పనసపంటికి మంచి • పస యొడఁ గూర్పక, ముసిడిపండ్లకుఁ దద్ద • యొసఁగినట్లు
బుధపుంగవులకు దం • బుగఁ గల్మి యొసఁగక, కూళల కిరవారఁ • గూర్చినట్లు
చిలుకను దడవేండ్లు • జీవింప నీయక, మఱిమఱి కాకుల • మనిచినట్లు

తే. గాక యుండక సత్కళా•కౌశలమునఁ, గోరి యారాజుతో నిన్నుఁ•గూర్చె నేని
తమ్మిపూచాలిప్రోడత•నమ్మి మిగుల, మెచ్చవచ్చుఁ గదా నేఁడు • మచ్చకంటి.

తే. అనుచు నతఁ డిట్లు పలికిన • నాత్మలోనఁ
జాన యొకకొంత మెత్తఁబా • టూని తేనిఁ
గనుఁగొనఁగఁ గోరి యత్తెఱం • గనుఁగుఁ జెలుల
కగుపడక యుండఁ గ్రమ్మిచు • నతని కనియె. 41

చ. అవు నవు మంచిప్రోడవె బ•ళా యళు కించుక లేక మానినీ
నివహసభాగ్రభాగమున • నిల్చి వినం గొఱగానివాక్యముల్
తవిలి వచింపఁ జాగితివి • తాళుదుమే మఱియొక్కఁ డైన దూ
తవు నిను నేమియుం బలుక • ధర్మము గా దని యుంటి మిత్తఱిన్. 42

క. సురనారీమణు లెచ్చట, ధరణీజను లెచట నహహ • తరతమభావం
బరయంగ హస్తిమశకాం, తర మిట్టివెడంగుపనులు • దలఁపం జనునే. 43

తే. చూత వగుటను నోరికిఁ • దోఁచినట్లు, దివిరి మోమోడ కాడెదు • దిట్ట వగుచుఁ
గటకటా ధూర్త మేము నీ•కంటి కిప్పు, డింత యెల్లిద మైతి మిం • కేమి చెప్ప.

ఉ. మాటికి నొక్కభూవరకు•మారుని నీ విపు డేమొ తద్దయుఁ
మేటి యటంచు నెంచెదవు • మే లహహా యతఁ డెన్న మామరు
తోఁటులలోన నేరి కెన • గూరుపఁ గాఁ దగుఁ జాలుఁ జాలు నీ
మాటలు గట్టిపెట్టి చను•మా మును వచ్చినత్రోవచొప్పునన్. 45

తే. అనుచు నవ్వేల్పుఁ గొందలి•రాపుఁబోఁడి
పలుకుటయు నాతఁ డెదఁ గొంత • గలఁగుచుండ
నపుడు నృపుఁ డచ్చటికి వేగ • నరిగి దాని
పజ్జ నిలిచిన నబ్బుర•పాటుతోడ. 46

సీ. జిలుఁగుపైట•ణికం•చెల పిక్కటిలి పలి, కులుకుసిబ్బెపుగబ్బి•గుబ్బ లుబ్బ
బిత్తరంపుఁబిసాళి•బెళుకువాల్చూపుమొ, త్తము లు తమ్మిలఁ • గ్రుమ్మరింప
గాటంపునిడుదకీ•ల్గంటు పెల్లే్రఁగున, నసదు నె డుము జ•వ్వాడి వ ఁకఁ
 గా ముత్యా •కమ లనునుడాలు, తళుకులేఁజెక్కుటం•ద్దములఁ బొదల

తే ... దు ంచుము గ•మా కముల, మొల గాకడానిసొ•మ్ములమెఱుంగు
లు డిగ మి నెమే న•న అపుచూష, రాజ రుఁ గాంచె లేచి యా•రాజవదన·

తే. కాంచి యాతని మోహనా•కార రేఖ
కద్భుతం బంది మే ల్మేల•యారె యిట్టి
సొగసుకాని మఱెం దైనఁ • జూచి యెఱుఁగ
నంచుఁ బల యూఁచి యవ్వేల్పు•మించుఁబోఁడి. 48

తే. చెలఁగి జగ మెల్ల మోహింపఁ • జేయఁ జాలు
నవవిలాసాప్తి నెసఁగుచు•న్నాఁడు చూడ
నహహ యీరాచమిన్న సో•యగముఁ గన్న
వలసి పై వ్రాలరే యెట్టి•పొలఁతు లైన. 49

ఉ. కన్నులవింటిదంటయును • గల్వలనెచ్చెలియు న్వసంతుఁడుం
గిన్నరరాజనందనుఁడు • గి మ్మనఁ జాల రొకింత యైన ని
వ్వన్నెలప్రోక మేనిచెలు•వమ్ము గనుంగొని మేలుమే లహో
కన్నులపండు వై యలరుఁ•గా జవరాండ్రకు వీనియందముల్. 50

ఉ. తుమ్మెదదిమ్మఁ బొమ్మనుచుఁ • ద్రోచునిగారపుసోగపెన్నెరుల్
కమ్మనితమ్మిక్రొన్ననలఁ • గాదనుముద్దుమొగంబు మించుట
ద్దమ్ముల నిమ్మలన్ గెలువఁ • దాఁకొనునిద్దపుఁజెక్కుదోయి డా
లమ్మక చెల్ల వీనిచెలు • వమ్మకరాంకుని నేలఁ జాలెడిన్. 51

సీ. మొలకనవ్వులవాఁడు • తళుకునిద్దామేల్క, డానిడాల్గఱచుమే•జానువాఁడు
తొగరువాతెఱవాఁడు • తొగలసంగడికానిఁ, దెగడునునుముద్దునె•మ్మొగమువాఁడు
వెడఁదకన్నులవాఁడు • వేల్పురారాసౌరు, నిరసించుసోగపె•న్నెఱులవాఁడు
మెఱుఁగుఁజెక్కులవాఁడు•మేటిసింగపుగున్న, నడలించుజిలుఁగునె•న్నడుమువాఁడు
తే. డంబు మీఱినబవిరిగ•డ్డంబువాఁడు, కంబునిభ మై తనర్చుకం•ఠంబువాఁడు
భళిర యీరాజకందర్పు•చెలిమి నాకుఁ, గలుగ వలవదె తొలుపుణ్య•ఫలము కలిమి.

క. అని యగ్గించుచు నెదుటం, గనుపట్టువధూలలామఁ • గనుఁగొని యొకిమీఁ
డనుపమహర్షాన్వితహృ, ద్వనరుహుఁ డై యరిదివలపు•వలనం బలికెన్. 53

క. మవ్వములప్రోఁక యతనుని, క్రొవ్వాఁడిలకోరి పూఁత•గాఁగివలపున్
బు ´ లచెం డహహో యీ, జవ్వని యెవ్వనియనుంగుఁ•జా యొ కదరా. 54

ఉ. వాలికమీల నేలునిడు•వాలుకనుంగవ మేలిజాలువా
డాలు గఱంచు మేను పగ•డాల నిసీ యను మోవి వేల్పురా
ఱాల జయించు వేనలి తె•ఱంగు హొరం గవురయ్య ముజ్జగం

చేలుట గాదె యీకువలయేక్షణఁ గౌఁగిటఁ గూర్పఁ గల్గినన్. 55

ఉ. దీని మెఱుంగుఁజెక్కులును దీని వెడందపిఱుందునందమున్
దీనిచొకారపుం దుఱుము దీనిమిటారపుగబ్బిగుబ్బలున్
దీనినిగారపుం దొడలు దీని మొగంబును దీనికన్నులున్
దీనివిలాసముం గని మదిం గడు సోలరె యెట్టిదిట్టలున్. 56

క. ఈహాటకనిభవిగ్రహ, నీహాపరితృప్తి యొదవ నెనసిఁ దొడలన్
బాహాలింగనసౌఖ్యం, బాహా యింతింతె యనుచు నలవియె తెలుపన్. 57

ఉ. అద్దిర దీనిచక్కఁదన మద్దివిజాంగనలందుఁ జెంద దీ
ముద్దులగుమ్మకౌఁగిటఁ బ్రమోద మెలర్ప వసింప కున్నరేల్
నిద్దుర వచ్చునే మరుఁడు నిల్వఁగ నిచ్చునె కోర్కె హెచ్చునే
సుద్దుల కేమి దీనిఁ గొని సూనశరాహవకేళిఁ దేలెదన్. 58

ఉ. ఉబ్బుచు మాటిమాటికి సముద్ధతమోహనిబద్ధులై
గొబ్బున నీసరోజదళకోమలవిగ్రహమోవిచక్కెరల్
జొబ్బనజుఱ్ఱగాఁ దవిలి జుఱ్ఱక కానిఁక నింపు కైనన
బ్బబ్బ నితాంతకంతువిశిఖాగ్నిశిఖాపరితాప మాఱునే. 59

మ. తలిరుంబోఁడులు లేరె రూపవతు లిద్ధా స్థలిన్ వారిని
ర లసౌందర్యవయోవిలాసవిభవప్రాగల్భ్యశ్రీ మేమెక్కు డీ
యలివేణీజనచూళికామణిని గన్నంతన్ మనోజాస్త్రసం
చలితస్వాంతసరోజులై తిరుగరే సన్యాసులు న్వెంబడిన్. 60

సీ. పుండరీకాక్షి యీభువనైకసుందరి, యాత్రేయవదన యీయబ్జగంధి
పర్వతజఘన యీభామాశిరోమణి, మాతంగగమన యీమంజువాణి
శాండిల్యకుచ యీయఖండతేజోనిధి, శుకవాణి యీమణిప్రకరరదన
భృగుకటిభాగ యీబింబఫలాధర, నారదవేణి యీనాతిమిన్న

తే. యీర యియ్యింతిపరమహంసాకృతిని బొ,సంగి యున్నది మది నరయంగ దీని
నెయ్య మొనఁగూడువానికి న్నిద్ర నిబిడ, నిరుపమానందయోగంబు దొరకు టరుదె.

సీ. ముగుదచూపులు శిలీముఖముల నిరసించుఁ, చపాళి ఘననీలరుచుల నెంచు
సతిమోము కమలక్షణాలీన రారు, మధురాధరము విద్రుమముల గేరుఁ
లికిపాదములు సౌగంధికంబుఁ బోలు, నఖరాళి తారాళి నవ్వఁ జాలు
తివపిఱుంద ధరామితోన్నఁ బొ... , గళసీమ శంఖపూగముల గెల్చు

తే. నలిశరాభ్రేంద్రమణిశశి•జలజకిసల, యప్రవాళాబ్జరాగక•ల్హారమౌక్తి
కగ్రనగభూదరక్రము•కములు సంగ్ర•హించుకొని నల్వ దీని సృ•జించె నేమొ. 62
సీ. తరుణివేనలి పయో•ధరములఁ దెగడుఁ బ, యోధగంబులు బల్ధ•రాధరముల
నదలించు నెఱి యధ•రాధరం బెన్నుఁ బ, ల్లవముల మఱియుఁ బ•ల్లవము లంబు
జంబుల గెల్చు భు•జంబులు బిసనిక, రంబుల గేరుఁ గ•రంబు లెపుడుఁ
గలఁగించు హల్లకా•వళులను వళు లుదం, చితజలరాశివీ•చికల మించు
తే. మించు నెమ్మేనిడాలు గ•అంచుఁ బసిఁడి, నౌగ యౌరగమహిలల•సౌరు సౌర
సారసాత్తుల చెలువంబు • సవతు సేయ, నీల లనయంఘ్రినఖములఁ • బోలఁ గలవె.63
తే. పస నెసంగెడుగజనిమ్మ•పండ్లు గిండ్లు, సిరులఁ జెన్నారుకుసుమమం•జరులు గిరులు
నరయ నిమ్మద్దుకెందలి•రాకుఁబోఁడి, కులుకుసిబ్బెంపుగబ్బిగు•బ్బలకు దొయె. 64
సీ. అవిరళవజ్రప్ర•హారంబులకుఁ దద్ద, చలియించునుత్తాల•శైలములును
దుహినాంబుబిందువు•ల్దోరలిన బిగి చెడి, క్రుంకెడురాజీవ•కుట్మలములు
నగ్నిశిఖావాప్తి • ననయంబు బిగి దప్పి, కరఁగి పాఱుసువర్ణ•కలశములును
జంద్రయోగమునకుఁ • జాలఁ దల్లడమంది, జత వీడి చనువలి•జక్కవలును
తే. సాటియే వజ్రహారతు•షారనీర, కుంకుమసితాభ్రయుతము లై • కుచరు మీఱి
జిగియుబిగి గల్గి యెడయక• చెన్నొసంగు,కన్నియలమిన్న యిఱిగుబ్బ•చన్నుఁగవకు.
తే. కమలభవలీలఁ గాంచె మొ•గంబు నడుము, హరివిలాసంబుఁ దాల్చె బి•త్తరపుగుబ్బ
చన్నులు గిరీశవైఖరిఁ • జెన్ను మీఱె, నహహ యియ్యింతి మూర్తిత్ర•యాత్మక గద.
సీ. అలిశశికార్ముక•తిలకుసుమోత్పల, కుందసౌగంధిక•కందుకములు
దర్పణశ్రీకార•దరబిసాంబుజచక్ర, వాకగుహోరగా•వర్తములును
గగనతరంగసై•కతపిప్పలచ్ఛదా, చలకరితుండని•షంగములును
గచ్ఛపవటుఫల•కల్హారతారకా, వసుపటీరశిరీష•కుసుమములును
తే. గూర్చి నలు వార నలువ యీ•క్రొమ్మె ఱుంగుఁ
బోఁడిఁ బోడిమి నొనరింపఁ • బోలు ట్లు
గాక యుండిన నీభువ•నైక మోహ
నాద్భుతాకారరేఖ యెం•దైనఁ గలదె. 67

క. నదమా పొక్కిలి జాంబూ, నదమా మెయిచాయ కోక•నదమా పద మా
పదమా జడ నడుము వియ, త్పదమా నూఁగారు గూష•పదమా చెలికిన్. 68
క. రాజీవముఖికనుంగవ, రాజద్గతి నెప్పుడుం ది•రస్కృతి సేయుజ్ఞా

రాజీవముల న్విచలిత, రాజీవములం బ్రఫుల్ల • రాజీవములన్. 69

తే. సరసలీలమహాఘన • చయము నాఁత , దర్శకశ్రేణియును గూడి • తరళనయన
కచకపోలవిలాసవై • ఖరులు పొఁగ , మొగి ననేకశతాబ్దంబు • లగుచు నుండ. 70

మ. గజయానం గుముదాక్షిఁ గేసరివల • గ్న న్నీలనీకాశమ
స్త్రజఁ దారేశముఖి న్ఘనాంగదవిరా • జద్బాహ ను త్తతో
యజగర్భప్రసవోపమానరద రా • మాంగిం దగ న్ని వే
భజియింప న్సుమనఃకదంబవరద • గ్వం బెల్లఁ జల్లాఱదే. 71

సీ. చంద్రబింబస్ఫూర్తి • జా నెప్పె నీనాతి, హాసాధరంబులు • నాననంబుఁ
గోకనదాకృతిఁ • గొనబారె నీకొమ్మ, స్తననాభిబిలములు • చరణయుగముఁ
గమలధరోద్వృత్తిఁ • గనుపట్టె నీయింతి, కగజఘనంబులు • కచభరంబు
మధుకరసాదృశ్య • విధి నొప్పె నీలేమ, మృదువచనోరువు • లెమ్మెఱుంగుటూరు

తే. వజ్రపుష్పాతిశయలీల • వఱలె నీవి, లాసినిరదాంగకంబులు • నాసికయును
భళిర యీరామసౌందర్య • పటిమ యెన్న, నన్నలినగర్భునకు నైన • నలవి యగునె.

క. అని యితరేతరమోహము, లనివారితగతులఁ బెరుఁగ • ననిమిషనారీ
జనరత్నంబును భూభృ, త్తనయశిఖామణియు వగలఁ • దగిలిరి మిగులన్. 73

శా. ఆవేళం జిగురాకుబాకుదొర ప్ర • త్యాలీఢపాదస్థుఁడై
చేవ డుతుంటవింట మధుసం • సేవాంచదిందిందిర
జావ ఓడార్చటు ల్నినిచి కో • పాటోప మేపార బల్
పూవుందూపులు చిమ్మె నిర్వ్వరపయిం • బుంఖానుపుంఖంబుగన్. 74

తే. లేమవీక్షణమాలాశి • లీముఖములు, శంబరారాతిశితసుమ • సాయకములు
గాటముగఁ బక్వియు న్మదిఁ • గాఁడుటయును, వసుమతీజానిపరవశ • స్వాంతుఁ డయ్యె.

క. అత్తఱి బిత్తరిఁ గని భూ, భృత్తనయోత్తముఁడు చత్త • రిలుచిత్తమునన్
మెత్తఁబడి క్రొత్తవలపులు, హత్తఁగ నత్తెఱవ కిట్టు • లనియెం బ్రేమన్. 76

క. ఎవ్వరిదానవు నీవే, ర తె యేమిటికి వచ్చి • తిచ్చెంగటికిన్
నెవ్వడి నీతెఱఁ గంతయుఁ, బువా రుంబోఁడి నాకు • బొంకక చెపుమా. 77

చ. తొలకరిక్రొమ్మెఱుంగుక్రియఁ • దోఁపఁ దళుక్కని నీవు ముంగలన్
లిచిన గండె ఝుమ్మని నీసొగ ఁ గడంక మీఱఁ గ
న్నులఁ గ ం నుం యు మ • నోభవు డేమియు నిల్వనీఁ డహో
చిలుకలకొ న న్నెదను • జేర్చి పామతి నుద్ధరింపవే. 78

క. అకటా మరుఁ డిపు డుల్లం, బకటావికటముగఁ జేసి • యడ లూనెఁ జు నీ
నికటాగ్రసీమ నిడి పూని కటాక్షవిలోకనమున • నెటేఁ బ్రోవు చె. 79

క. వీటీపాటీరాగరు, హాటకతాటంకమణిమ • యాభరణంబుల్
గూటువలుగ నిడియెద నిఁక, జోటీ మాటాడి ముద్దు • చూపం గదవే. 80

క. ఈరేడుజగములం దిఁక, నేరీ నీరీతిగోతు • లెన్నిక గనునో
యా రీ తీ రగుకులుకుమి, టారీ వలతేనిమేల్కొ • టారీ నారీ. 81

క. అలి రపికమరాళా, వలికిం గరువలికి మరుని • వాలారుంబూ
ములికిగమిసోఁకులకు నో, కలికీ మదిఁ దాళఁ జాలఁ • గలఁ లిఁ కేలా. 82

క. కులుకుచు జిలిబిలిపలుకులు, చిలుకుచు వలిగుబ్బ లెదను • వె మరుపూ
ములికీ కలికీ చిలుకల, కొలికీ మది నూలుకొనెను • కోరిక దీరన్. 83

క. కొమ్మా మదనునిపూవుం, గొమ్మా నెమ్మది యెలర్పఁ • గొమ్మా కడుఁ దో
ర మ్మైమ్మనసామ్ము లిడియెద, రమ్మా ననుఁ గూడి మాపు • రమ్మన కెలమిన్. 84

వ. అని యనేకప్రకారంబులం బా ర్థించిన నమి ంచుఁబోఁడి యించుక దల వంచి మిన్న
కున్న సన్న యెఱింగి యన్నెలంతుకబోటి త్రియ యగుమదనమోహిని యన్న రేం
ద్రచంద్రుం గాంచి యిట్లనియె. 85

తే. అవనినాయక సుశ్యామ • యనెడుపేర, నలరు గంధర్వరాజక • న్యాలలామ
యివ్వేలందుక దీనికై • యిట్లు వగలఁ, దగులఁ దగునయ్య మీవంటి • తగవరులకు. 86

తే. కన్నవా రె నగఁ దముఁ • గన్నవారి, మిన్న కెంతయుఁ బో నాడి • యెన్న రాని
మున్నటికెల మెలంగుట • చన్నె యెందుఁ, జిన్నిప్రాయంపుముద్దుగా • కన్నియలకు.

తే. అని పలికి కల్కిఁ దోడ్కొని • యనుఁగుఁజెలులు
వేసఁ దదంతికలీలాని • వేశమునకుఁ
జని రటు ల్చనుచున్నఁ గ • న్గొని మహీప
భుండు డాయంగఁ బోయి పూఁ • బోఁడి కనియె. 88

చ. నిలు నిలు పోకు బాల హరి • నీలనిభాలకజాల నీకు నే
వలసితిఁ జాల నన్నిటుల • వంచన సేయఁగ నేల చూడఁ బూ
విలుతుఁడు కూళ వాఁ డిడె • వేదన కోరువఁ జాలఁ బ్రేమ న
న్నలయుము వేళ నమ్మరుని • గ ము దూల విలాసలీలలన్. 89

ఉ. చక్కఁదనంబు జవ్వనము • జాణ నంబును గల్గి కీవిఁ బెం
పెక్కినదాన నంచు నొక • యించుక గర్వము పర్వ నన్నిటుల్

గిక్కురవెట్టఁ జూచెదు చెలీ పదమా ముదమార నింక నా
చక్కెరవింటిదంటనునఁ • జాయలకోరుల నేమి యయ్యెదో. 90

క. బాలా వేలాగుల బతి, మాలిన విన కిగ్గయాళి • మదఁతులవెంటన్
ఖేల వయి చనెదు మరుపిరి, గోలలపా లై కరంబు • గుందెదు సుమ్మీ. 91

సీ. నీవు మాటలు నేర్పి • నెమ్మితోఁ బ్రోచిన, చిల్క చిల్కఁగఁ జుమ్ము • చిగురుఁబోఁడి
నీ వాట దిద్ది మ • న్నించి పెంచినబర్హి, బర్హి యగుఁ జుమ్ము శం • పాలతాంగి
నీకొలంకులఁ జేరి • నెక్కొన్న కోకంబు, కోకమౌఁ జుమ్ము చ • కోరనయన
నీతోఁటమధు వాని • నీటు గాంచినయళి, యళి యగుఁ జుమ్ము మ • త్తాలివేణి

తే. దైవబల మేరికి నొకింత • దప్పె నేని
ప్రాణబంధువు లైనను • బగతు లగుదు
రింతి యటు గాన వేగ న • న్నేలుకొనుము
కాయజుఁడు ని న్నెనఁక కుండఁ • గాచువాఁడ. 92

క. అనుమాన ముడిగి వినుమా, నను మారునిబారిఁ బ్రోచి • ననఁబోఁడి వెసం
జనఁ జూచెద వలవిధి నె, క్కొనునిక్కల నిన్నుఁ గట్టి • కుడిపెడిఁ జుమ్మీ. 93

సీ. వల తేఁడు వాఁడిపూ • ములికిమొత్తము లేయఁ, జలివెలుం గుడుకు వె • న్నెలలు గాయ
గ రిజమిలిము • క్కాలిబారులు మ్రోయ, బలితంపుగండుఁగో • యిలలు గూయఁ
.. లువరాచిలుకబో • దలు హాళాహాళి సేయఁ, గొలఁకుజక్కవపాఁజు • తెలసి రేయఁ
గొదమనట్టువపిట్ట • రొదలు తాలిమిఁ ద్రోయ, వెలిలావుపులుఁగుచా • ల్వినము గ్రాయఁ

తే. గమ్మకపురంపు పెనుదుమా • ర్మమ్ము రేఁచి, పొరిఁబొరిఁ బిసాళినాళి తె • మ్మెరలు డాయ
నయ యోగోల నలువకు • నలవి గాని, కడిఁది వలవంత పెకకొర్వఁ • గలవె చెపుమ.

తే. చాన ననుఁ జూడు గడితంపు • నాన వీడు, కేరి మాటాడు కుసుమాస్త్ర • కేళిఁ గూడు
చెలులఁ దెగనాడు నీకు • నీచేత నాడః, తలిరుఁబ్రాయంపుముద్దురా • చిలుకతోడు.

క. అనుమాటలు విని మానిని, యనుమానింపుచు నటున్న • నపు డాన్నృపుఁడున్
నెనరొదవ మదనమోహినిఁ, గనుఁగొని యిట్లనియె నేర్పు • గడలుకొనంగన్. 96

ఉ. మోహసమగ్రతం బ్రియుఁడు • ముద్దియయుం గవగూడి కోరి యు
త్సాహమునం జెలంగునెడ • జంట దొఱంగి చనంగఁ జేయుటల్
ద్రోహము గాదె హె రికతో నిను వేఁడెద నాకు నీజగ
న్మోహినిఁ గూర్పవే • మో ని శాశ తపుణ మబ్బెడిన్. 97

ఉ. కాఱుదురాపతాపహతిఁ గ్రాఁగుచుఁ జక్కనికోడెకాఁ డెదన్

నేమఱుఁ బ్రేమ ముల్లసిల • వేఁడుకొనంగ ననంగసంగరో
ద్దామవిహారలీలల ముదం బొనరించి కఱంచ లేరయా
కామినిసోయగం బడవిఁ • గాచినవెన్నెల గాదె చూడఁగన్. 98

క. మీ గ్రామామణి కడిఁదిదియొ, యారమణిగో మమ్ముబోంట్ల • కాస కొలుపుచుఁ గ్రా
గారా మారఁగ గడితఁపు, టారామముల స్త్రైలంగు • టర్హామె చెపుమా. 99

తే. తలిరుఁబోఁడికి గాదిలి • చెలులు మీర
లిందఱును గల్గుటనుఁ జేతి • కందినట్టి
మేలు వోఁ ద్రోచెదరు గాని • మీఁద వచ్చు
చెఱు గొకించుక యైనఁ బో • నిడఁగఁ గలరె. 100

క. శుకవాణికి నాపై నిం, చుక కూరిమి గలిగి యున్న చో • ప్పనయక యా
రక యెడ సేయఁగఁ జూచెద, వకటా ముకురాస్య సరసు • రాలవు గదవే. 101

తే. అద నెఱిఁగి యుందు నీయిందు•వదన పొందు, నాకు సమకూర్చితేని య•నేకమణివి
భూషణాదు లొసంగి యెప్పుడును మదిని, మదనమోహిని నీమేలు • మఱువ సుమ్మి.

క. అని పలుకునెడలఁ జెలులెల్లని దేమిటిజోలి సరి బం•తా పదపదరే
యని చెలిఁ దోడ్కొని గొబ్బునఁ, జని రంత విభుండు గుండె • ఝల్లన లీలన్. 103

వ. అంతట నొక్కచొక్కటంపుటెక్కరాచట్టుపయిం జతికిలం బడి నెమ్మొగంబున దైన్యం బిగురొత్త వెచ్చ నూర్చుచు సంగడికాని మొగంబు చూచి యి ట్లనియె.

ఉ. అక్కట మిక్కుటంపుగొన • బారఁ దళుక్కని తొల్మెఱుంగున
ట్లక్కజ మొప్పఁ గానఁబడి • యాసలు చూపి కఱంచి యిప్పుడా
చక్కరబొమ్మ యెచ్చటికిఁ • జాఁగెనొ నన్నిసురించి యింక నా
చక్కరవింటికూళనునుఁ•జాయలకోరుల కోర్వ వచ్చునే. 105

చ. ఎటువలెఁ దాళువాఁడ నిపు • డెవ్వరి నేమని దూరువాఁడ న
క్కుటిలశిరోజ నెయ్యెడల • గొబ్బునఁ గ నువాఁడ నెట్టు లె
క్కటితలిరాకుబాకు మొన•గానిహాళాహాళి కోర్చువాఁడ న
క్కటకట చెల్మికాఁడ వల•కాఁకలఁ దాళ నిఁకేమి సేయుదున్. 106

సీ. పొలఁతుక జిలిబిలి•సొలపుఁబాటలకును, మగువనిద్దపుముద్దు•మాటలకును
ననఁబోఁడిచిన్నారి•నగవుచూపులకును, గొమ వేడబపుమే•లొక్కపులకును
రాకేందుముఖిచొక్కా•రంపువెన్నెలకును, జే యమురి పెంపుఁ•జిన్నెలకును
కలికిచ బ్బిగు•బ్బలులనిక్కులకును, జెలువచొక్కపుఁదళు•క్కుఁజెక్కులకును

తే. వలసి పొలసితి నది నన్నుఁ • గలసి మెలసి, బలసి కోర్కులు దీర్పక • తులువకలువ
విరులకోరీవజీరుబ•ల్వైతలఁ ద్రోచి, చనె నయారె యిఁ కేజాడ • సైఁపువాఁడ. 107

సీ. బలితంపుగండుఁగో•యిలలకూఁకలకును, దలిరువాల్తులువబ•ల్దాఁకులకును
గొలఁకునెత్తావిసోఁ•కుడులవీఁకలకును, వలపుగొజ్జెఁగనీటి•వాఁకలకును
మొదలుటాటోటుతు•మ్మెదలప్రోఁకలకును, గలువసంగడికాని•కాఁకలకును
జెన్నొందుకలికిరా•చిలుకమూఁకలకును, మురిమించుక్రొమ్మావి•మోఁకలకును

తే. జాలఁ దూలెద నీకఁ దాళఁ • జాలఁ జాల, మేల మేలుర నమ్మిద్దు•బాల లీల
వైళ మిప్వేళఁ గూర్చి న•న్నేలుకొనుము, చెలిమి గడు డెందమున నిండఁ • జెలిమికాఁడ.

వ. అని యనేకప్రకారంబులం దగిలి వగలం బొగులుచున్న యారాచమిన్నం గనుంగొ
ని నర్మసఖుం ట్లనియె. 109

క. ఓ తేఁడ నీవు పలుమఱుఁ, గాఱడవులవెంట నన్య•కామినికొఱకై
కాఱియలఁ బడుచు వలపులు, మీఱఁగ నవియింపఁ జనునె • మే నలయంగన్. 110

క. పలుదెఱఁగులఁ బెఱచెలికై, వలకాఁకలఁ గ్రాఁగి వేఁగ • వలవదు నీకున్
వలసిన మతి యెందును వలి, కులుకుం బ్రాయంపుము•ద్దుగుమ్మలు లేరే. 111

చ. పటుమతిఁ జిత్తగింపుము నృ•పాల విరోధివరూధినీధవ
స్ఫుటమకుటాగ్రరత్నఘృణి•శోభితపాదసరోరుహుండ వీ
విటు లొకయన్యపంకజద•ళేక్షణకై పలుమాఱు సోలుచున్
గటకట యింత గాసిఁ బడఁ • గారణ మేమి కడింది మీఱఁగన్. 112

క. వేలాగుల నన్యవధూ, లోలుఁడ వై నాన యుడిగి • లోఁగెదు ధరణీ
పాల విను "కాముకస్య కుతో లజ్జా" యనెడునుడువు • తుది నిజ మయ్యెన్. 113

క. కొదలేనివగలఁ బొగలుచుఁ, గొదకొని వనిఁ దిరుగ నేల • గొబ్బున నిపు డో
సుదతీజననవమన్మథ, పదమా ముద మార వసన•భవనంబునకున్. 114

వ. అని యనునయింపుచు నర్మసఖుం డతనిం గ్రమ్మఱఁ దోడ్కొని వచ్చుచున్న యెడ
నారాజన్యపుంగవుండు మున్న న్నిలింపనితంబినీమణులు విహరించి చనినవనంబు
చొచ్చి. 115

• పద్మరేఖా తాం•బరచ ప్రమదాంఘ్రి పద్మలాక్షాంకిత•ప్రాంగణములు
దివి స్నితం •తీకబరీ ర, స్రస్తామర ప్ర•సవచయములు
ర్వకులరాజ•క - స్త లిప్త, హారిద్రముద్రితా• — రములు
సే° నారీమణీ•సరసవి రక్తి యాప్రఫుల్లన్మనో•జ్ఞాగములు

తే. క్రతుభుగంభోజలోచనా•కృతము నోజ, బూజనాయత్తఫలగంధ•పుష్పధూప
దీపనైవేద్యముఖ్యవి•స్తీర్ణవస్తు, సంతతులు చూచి పరవశ•స్వాంతుఁ డగుచు. 116

సీ. ఈకళాకులి చెంత • రాకేందుబింబాస్య, తివిరి యంచకు నడ • లిద్దుచుండె
నీమహీజమునీడ • నిందీవరేక్షణ, చిలుకకుఁ బలుకులు • చెప్పుచుండె
నీదరీతటిదరి • నిభరాజగామిని, నెమ్మికి నాటలు • నేర్పుచుండె
నీనికుంజముదండ • మానినీతిలకంబు, తోడరి శారికి మేఁత • లిడుచునుండె
తే. నీనిశాకాంతకాంతమ•ణీనిశాంత, కాంతనవరత్నమయవేది•కాంతరమునఁ
గాంత జిలిబిలిపాట లే•కాంతలీలఁ, బాడుచుండెఁ గదా చెల్మి•పడఁతు లలర. 117

సీ. సకియక్రొందళుకుపి•సాళిచూపులకోపు, ముగుదని ప్రముద్దు•మోముగోము
కో సిబ్బెపుగబ్బి•గుబ్బచన్నులచెన్ను, కోమలాం వెడంద•కొప్పుకప్పు
రా ందుముఖిని గా•రంపుఁజెక్కులటెక్కు, సుందరివలుద •ఱు నందు
గంధసింధురయాన•ఘనతరోరులతీరు, హరిణనేత్ర మెఱుంగు•టూరుసౌరు
తే. దలఁచుకొన్న జగం బెల్లఁ•దన్మయముగఁ, గనఁబడుచు నున్న దింక న•క్కలికిమిన్న
నెందుఁ గన్గొనువాఁడ నా•డెందమునకు, నక్కటా మిక్కుటం బైన•యార్తి వొదవె.

క. ఏలా హేలాలీలల, నోలిం గ్రీడించునద్ది•వోకఃకులరా
డ్బాలామణిఁ బోఁ బనిచితి, బేలతనం బొదవ రి • బెదరించి యయో. 119

క. నిర్భరపుణ్యఫలప్రా, దుర్భవు లగుసుజనులకును • దొరకుం గా కా
స్వర్భామాసాంగత్యము, ర్భాగ్యుఁ నై ననాకు • నేఁ డెటు ల న్. 2

వ. అని తలంచుచుండి మఱియు సంగడికాని కి ట్లని. 121

క. చెలికాఁడ యెట్టినోములు, సలిపెనొ యిగ్గొఁగుప్రాను • జలజేక్షణ నుఱ
జిలిబిలిముకుంబలుకుల, నలరించినఁ బెంపుఁ గాంచె • నభినవలీలన్. 122

చ. చెలిమి ద ర్ప నానవకు•శేశయపత్రవిశాలనేత్ర ను
గ్గలపపుఁగమ్మఁదావులు ఘు•నమ్ముగ మ్ముగఁ గ్రమ్మరించుబ
లుకులకుమిటారిగబ్బిచను•గుబ్బల నొత్తి కవుంగిలించె నా
భ భళి యిక్కురంటకము•భాగ్యము చెప్పఁ దరంబె నెచ్చెలీ. 123

చ. వలఁ తనం బెలర్ప నల•వారిజపత్రవిశాలలోచనా
తిల ము న న్నొక్కించుకయుఁ • దేఱి కనుంగొన దయ్యెఁ గాని యీ
తిలకమహీజరాజము న•తిప్రియతం దనసోయగంపుడా
ల్నొలపుఁబిసాళిక్రొందళుకుఁ•జూపుల బిట్టలరించెఁ బో సఖా. 124

క. విధుబింబానన పుక్కిటి, మధు విడి యిప్పాఁగడ్రమాను • మగి ంచెఁ జెలీ
మధురాధరాధరాంచ• త్స్మధురస మిడి కనికరమున • నన్ బ్రో వదుగా. 125
క. మహిలామణిషాణిసరో, రుహసంస్పర్శం జెలంగి • క్రొన్నన లెత్తెన్
సహకారభూజరాజం, బహహా నా కిట్టిభాగ్య • మబ్బునె సఖుఁడా. 126
క. వలనుగ నమ్మర్దం బై, దలి వలి నిట్టూర్పుకమ్మ• తావులచే వా
విలి ననిచె ననఁగ నిది వే, ల్పుల ము న్నె వ్వారి నెట్లు • పూజించెనొకో. 127
తే. చేడియలమిన్న మృదుపద• తాడనంబు
గాంచి యంచితసుమసూన• కాసలీల
నలరుచున్నది కంకేళి • యహహ దీని
పుణ్యఫల మెన్నఁ దరమె యిం• పుగ వయస్య. 128
క. పాటలగంధిచొకారపుఁ, బాటల నీ ప్రేంఖణంబు • బహుతరసుమనః
పాటవమున నలరెడు ని, ప్పాటలఁ బాడింప నెంత• భాగ్య మనుంగా. 129
తే. కన్నియలమిన్న చిన్నారి• క్రొన్నగవుల, వన్నియలు మీఱ నిప్పొన్న • గన్న నలరఁ
జేసెఁ గాని యదియో నేఁడు • చెలిమికాఁడ, నన్నుఁ గన్గొని యొక్కింత• నవ్వ దయ్యె.
క. చెలిమోము కళలసంపఁగి, నల సొందం జేసె నది వ•య `  ననుఁ దాఁ
దల యెత్తి చూడ దయె ను, జెలువను నే నేమి తప్పు • చే తిఁ జెపుమా. 131
వ. అనుచు వెండియు. 132
క. అమ్మాని నేఁడు వనిం, ద్రిమ్మరుచో నొక్క పువ్వు• దీవియపై జుం
జుమ ని మొఱయుచు నాడెను, తుమ్మెదఁ గనుఁగొని కడంక• తో ని ట్లనియెన్.
చ. అమ నితం నీసురుచి• రాననసారససారసౌరభ
భ్రమఁ బఱతెంచె దేమొ మద•బంభరరాజమ శంబరాహితా
సమసుమసాయకవ్యథలఁ • జాలఁ గలంగుచు ను నా తెఱం
గమలకృపాంతరంగమున • నప్పువుఁబోఁడి కెఱుంగ జెప్పుమా. 134
• అలికులతిలకమ నినుఁ గ, న్నులఁ జూచినయంతలోనె • నూల్కొను ప్రేమం
జెలితుఱుము నాదుఁ జూపులుఁ, దలఁ మ్యెడు నింక నెట్లు • దాళుదుఁ జెపుమా.
మ. క్రతుభు గ్గంజముఖీవియోగభరవి• క్లాంతుండ నై యివ్వనిన్
వెత గుందుచు ను నన్ను గరుణన్ • వీక్షించి నీ మొదన్
బ్ర కి ప ఁ ద ంచి ... మే • ల్వాత్యం శోభా రీ
ృతజంభారిశిలా ర్మల ణి • యింది దిగ్గ్రామణీ. 136

ఉ. అక్కట మిక్కుటంపువిర • హానలవేదన కోర్వలేక ని
న్నక్కఱతోడ వేఁడెద ద • యామతి నోయెలదేఁటిమిన్న నీ
రెక్కలమీఁద నన్నునిచి • టెంగున నప్పురవీథి నేగి యా
చక్కెరబొమ్మపాదజల • జమ్ములసన్నిధిఁ జేర్పు నేర్పునన్. 137

తే. అక్కటా నీకుఁ గల్గిన • రెక్క లిపుడు
నాకుఁ గల్గిన మింట నం • దముగఁ బఱచి
యమరభామినికుచగుళు • చ్ఛములమీఁద
వ్రాలి సుఖియింతుఁ గద మధు • వ్రతకులేంద్ర. 138

సీ. అవనిఁ బరోపకా • రా మిదం శరీ, ర మ ని యార్యజ • నము లెపుడుఁ
బలికెడుమాట యే • ర్పాటుగా నీవు ము, న్నని యుండుదువె ద • విను మలీంద్ర
నాకొఱ కిపుడు క్ర • న్నన నేగి గంధర్వ, కాంతాలలామంబు • గాంచి వెరవు
మెఱయ నిత్తెఱఁ గెల్ల • నెఱిఁగించి దాని నె, ట్లును బుజగించి తో • డుకొనిరము
తే. కాక యుండిననామాఱు • గాఁ దదంఘ్రి, వనజయుగ్మంబుపై వ్రాలి • వినతు లొసఁగి
యడుగుకొనియైన నిచటికి • ప్పుడఁ దెచ్చి, యనుపమాగణ్యపుణ్యావ • ర్తనలమనుము.

వ. అని యెడయనియెడరుల బడలి యడలుచున్నయొడయని మెల్లనె యూరార్చి స
ఖుం డెట్టకేలకుఁ బటకుటీరాభ్యంతరంబునం జేర్చిన నమ్మహారాజచంద్రుండు. 140

సీ. పగడంపుఁగంబము • ల్పచ్చరాబోదెలు, గొనబారు మొకమాలు • గోడబారు
కుతినీగుడారు త • ళుక్కుపసిండికుండలు, జరబాబుచందువా • సౌరుమీఱు
గుజరాతికెంపురా • గుంపుజొంపములు ము, త్తెంపుజాలీలు ద • ట్టంపుతావి
నింపు నునన్మంచిగం • దంపుమేకులు జగా, డంబారుహొంబట్టు • పంబుదాళ్లు
తే. గలిగి యభినవశృంగార • గౌరవమునఁ, జాల నలరారు డేరాహ • జారమునను
గడిఁదిదంతపుఁగోళ్లచెం • క్కడపుఁబనిక, డానిమంచముమీఁద నెం • మే ను చేర్చి.

క. ఊసు ఁసు రంచుం బొరలుచుఁ, గసరుచుఁ గ్రొవ్వేఁడియూర్పు • గాడ్పులు నిగుడన్
బసచెడి బుసగొట్టుచు వెస, మసుఁగిడి వలకాఁకకడలి • మునుఁగుచు నుండెన్.

వ. మఱియు నద్ధరావరపుంగవుండు నిజాంతరంగం బయ్యంగనామణి జగన్మోహనాంగ
శృంగారరసాభంగరంగత్తరంగిణీసంగతం బై మునుంగ నింగితం బెఱుంగ లోఁగి
లంగి బెంగగొని నింగియుఁ బుడమియుం గనరానియంగభవదురాపతాపాటోప
మాయాంధకారంబు ఘోరంబుగఁ దోరంపుఁగన్నుంగవం గప్పునం గప్పుకొన్న నే
ఖియుం గానరాక చీకాకుపడి వీఁక చెడి యడలి బడలి యొడలెరిగి సడలి గడగడ

వడంకుచుఁ గొంకుచు బెగడి దైవంబుఁ దెగడి నిగనిగ జిగిదళుకొత్తు క్రొత్త నెత్తమి
చీకులపస న్నిరసించు నిడువాలుకన్నుంగవం దొలంగుబుడిబుడి వేఁడికన్నీరుబడిబ
నిద్దంపులేఁజెక్కుటద్దంబులం జాలువాఱ రాకానిశాకరబింబప్రతిమానమానితవదనా
రవిందంబు వాడు దేఱ గుజరాతిపచ్చరాతి మెఱుంగుహొరంగులం బొంగారుబంగా
రుచిలుకతాళి మేలిపసిండివన్నియజన్నిదంపుగుంపుతోడం బెనంగొని కరంబునురంబు
నం దారజగానిగారంపుసొంపు పెంపునం గనుపట్టు హొంబట్టుబొందుపొందుపడం జుట్టి
కట్టిన వెడందక్రొమ్ముడి సడలి నెత్తావిక్రొత్తచెంగలువక్రొవ్విరు లుర్వింగూరఁ జిన్నా
రిక్రొన్నెలనెన్ను నెన్నొసలం జెన్నారు తిన్ననిసన్నంపుకమ్మకస్తురిరేఖ యొక్కుమ్మ
డి ముమ్మరంపుచెమ్మటబుం బద చెక్కి నెమ్మొగంబునం గ్రమ్మి పాఱ హారకేయూ
రకటకకంకణక్షుద్రముద్రికాదిమహాభరణంబులు సడలి జాఱ బలితంపువేఁడినిట్టూ
ర్పుగాడ్పు సెగలం గంది కెందలిరుటాకుబృందంబులం దెగడు తొగరువాతెఱ తెలు
పు మీఱ నుస్సు రనుచు ఘుమ్మలింపుచు నుదరి పడుచు బెదరి బెదరిన డెందంబుతోడం
గళవళింపుచుం గటకటా యనుచుం గ్రన్నన లేచి తల యూఁచి దిశలు చూచి వి
వేకంబు రోచి విరిసరంబు లవని వైచి యేచినతమకంబున నాచిగురుటాకుంబోఁడి
నాఁడెంపు గడాని మేనిజాను మానసంబునం దలపోసి గాసిలి వాసిం బాసి చెయువులు
రోసి కఱకు బెఱకు చెఱకువిలుకాఁడు బిఱబిఱం బఱగించు చుఱుకువిరిచిలుకుమొత్తంబు
లు చుఱచుఱ నదరంటం గాఁడిన సోలితూలి తాలిమి వ్రీలి పర్యంకభాగంబున వ్రా
లి ఘోరమారవికారాపస్మారదూరితవివేకం బగుచు నంత నప్పంకజాక్షి సుముక్షుంబు
న సాక్షాత్కరించినట్లు గనుపట్టినఁ బట్టరానియాశాపాశంబులం గట్టువడి గుట్టు చె
డి బిట్టువడి నెట్టకేలకు హాబాలఘాలతలాలోలనీలనీలాలకజాల జాల మేల జాలిం దా
ళఁ జాలఁ జాల నిక్కాళమయూరకీరశారిహారీతపారావతపరభృతప్రముఖవివిధవ్రా
తసమేతాయాతమనోజా కిరాతకరాతతాతిశాతసీతచూతాగ్రాతశిలీముఖసంఘాత
యా నోగాతభీత తచేతస్కుండ నైననన్ను నన్యుగాఁ గను గొనక కనకకలశోప
మానానూ పీనపయోధ ద్వయం బురంబునం గదియించి కుదియించుచు హాళిం బైకొ
ని మనోజసరోంతరా నాళీకమృణాళనాళసదృగ్భుజలతాయుగంబున బిగ్గఁ గౌఁగి
లించుచు ధగ గాయమానమాని హీరప్రభాపుంజరంజితహాటకతాటంకంబులు మక
ర నసూ నముకు లకోపమా ంబు లగుగండభాగంబులం డాండవం బాడ సురేం
ద్రనీల కాళకే పాశం బవటుప్రదేశంబునం జిందాడఁ దిన్ననిసన్నంపునెన్నడుము గడ
గ వడంకఁ త్తహురుమంజిమ త్తియంపుసరంబులు దిరంబుగఁ గులుకుసిబ్బెంపు

గబ్బిగుబ్బలపయిం బరిపరిగతుల నర్తింప మంజుమంజీరకంకణకింకిణీనిరావంబులును
గళరవసీత్కారంబులం జెలంగ నఱమోడ్పుకన్నుంగవం జెఱుకుఁదళుకువాలుంజూపు
లేపు చూపఁ గమ్మకస్తురికలపంపుఁబూఁత దట్టంపుజెమ్మటసోనలం గరంగి నెమ్మె
యిం జాలువాఱఁ గేరిడాకేలం జెక్కిలి నొట్టి ధట్టించి రెట్టించుతమకంబున నుప్పొం
గి విపగ నాగొప్పకన్నుంగవం గప్పుకొనం గప్పురంపురజం బొప్పుగ గుప్పుగుప్పున
గుప్పి కొలందిగ గుప్పుచుం జక్కెరకెమ్మోవిపంటం బట్టి చుఱుక్కున నొక్కి చొ
క్కుచుఁ గులికి కిలకిల నగి కిలికించితరసంబు చిలుకుచుఁ దేనియ లొలుకం బలుకు
చుఁ బలుదెఱంగులఁ బుంభావసంభోగక్రీడావినోదంబుల మోదం బొదఁగూర్చి
యాదరించి మనుచు మనుచుం బాణియుగం బెత్తి మ్రొక్కి బతిమాలుచు బయలు
కౌఁగిలింపుచుఁ బలుకరింపుచు బాష్పాంబుపూరంబు నించుచుఁ బలవరింపుచు నుండి
కొంతసేపునకుఁ దెలివిం దెచ్చుకొని మరునిప్రభావంబునకు మెచ్చుకొని తనుఁ దా
నె నొచ్చుకొని క్రచ్చుకొని యింక నెవ్వా రివ్విధం బప్పువ్వుఁబోఁడికి నెఱింగించి
మది కరంగించి కూర్చి పేర్చునిమ్మదనవేదనానలంబు చల్లార్చం గలవా రని యనేక
ప్రకారంబుల మనోవికారంబులం బొరలుచుండి దానహీనభూనాయకుండునుం
బోలె నాశుకవిసంభాషణప్రసంగవిముఖుం డై శాస్త్రజ్ఞానానభిజ్ఞ షగ్వరుండునుం
బోలె సంపూర్ణచంద్రోదయలక్షణపరీక్షానపేక్షితుం డై కుకవియుంబోలె సుశబ్దా
లంకారమార్గరహితుం డై సమరభీరుండునుంబోలెఁ బ శిలీము ఖన్మరు ంకార
వికంపితస్వాంతుం డై బలవంతం బగువలవంతం బొ లు చుండె వెండియు. 143

ఆ. పరవశాత్ముఁ డై ప్రపంచంబు మఱచి జ, గంబు దన్మయంబు • గాఁగఁ దలఁచి
గుణవిహీనుఁ డగుచు • గణుతింప నతఁడు ని, యోగి యై కృశింపు • చున్న యెడల.

క. మతిమంతుఁ డట్టిగాటపు, వెతలం బడి పొరలునవని•విభుఁ గనొని హా
క్షితివర నీ వి త్తెఱఁగున, ధృతి చెడి యడలంగఁ దగునె • దీన తోడన్. 145

క. పురములు విడి పాఱవె కుల, తరుణులు వెత పడరె బుధులు • త ప్పెన్నరె నీ
సరిదొరలు నగరె వం లఁ, గర మడలరె ప్రజలు నీప్ర•కారము విన్నన్. 146

మ. అకటా భూపకులాగ్రగణ్య నయవి•ద్యాభ్యాసపారీణతా
ధికస శుద్ధమనస్సరోరుహుఁడ వై • దీపించునీ విట్లు నేఁ
డొక మంతవతీవతంసమునకై • యో ర్పింతయు న్లేక రయూ
రక చింతాకుఁవృత్తి నుం ( దగునే • ప్రజ్ఞావిహీనుండ వై. 147

మ. కరు లశ్వంబులు నందల బులు శతాం•గంబు ల్మణీభూషణాం

బరవీటిమృగనాభిచందనఘన•ప్రాసాదదాసాదులుం
దరుణు లా... ళిలు ఛత్రచామరము లు•ద్యల్లీలలం గ్రాలుని
ర్భరసామ్రాజ్యభరంబు వో విడిచి చే•డ్వా టొంద నీ కేటికిన్. 148

క. ధరణిం గలజను లందఱు, దిరముగఁ దమయాజ్ఞ మెలఁగ • దృఢతరసామ్రా
జ్యరమాయుతు లగునరపా, లుర కెందును దైన్యవృత్తి • లోఁ గం దగునే. 149

క. వసుధాధిప మృగయాద్యా, తసతీముఖ్యంబు లగుచుఁ • దనరెడుసప్త
వ్యసనములఁ బొరలుమనుజుం,డు సెడుం గడుసౌఖ్య మెన్నఁడుం గనకార్తిన్. 150

క. భళిభళి విను మీ వెదలోఁ, దలఁచినఁ బదివేలు ముద్దు•తలిరుం బోఁడుల్
గలిగెద రిటువలె గడితపు, వలవంతం జెందికొంద•వలదు నృపాలా. 151

క. మదిరాక్షులవలలం బడి, మొదలం బెక్కుండ్రు బన్న•ములఁ జెంది రహా
పదివేలు చ్చె నింకం, బొదమా రొద మాని వేగఁ • బురవరమునకున్. 152

వ. అనిన నతని కానృపతి యిట్లనియె. 153

మ. పురము యినఁ బోవనీ బుధులు త•ప్పుల్పట్టినం బట్టనీ
తరుణుల్గుం నఁ గుందనీ ప్రజలు వం•తం జెందినం జెందనీ
సరివార్న వ్విన నవ్వనీ సచివ నే • సంప్రీతిఁ దద్దేవతా
హరిణాక్షీనిబిడోపగూహనసుఖా•యత్తుండనై యుండెదన్. 154

. కలకంఠిసి ంపు•గబ్బిగుబ్బలసొరు, తరుణిలేఁజెక్కుటం•ద్దములతీరు
నెలఁతనిద్ద ముద్దు•నెమ్మొ ంబుహారంగు, చానవాడెంపును•నే నిరంగు
కలికిబిత్తరివాలు•తళుకుఁజూపుల యొప్పు, విరిఁబోఁడిమెఱుఁగు పె •దుఱుమువిప్పు
కరిరాజయానచ•క్కెరకెంజెదవిసొంపు, సుందరివలుదపి•ఱుందు పెంపు

తే. డెందమున నాట మిగులఁ గ•డిందివలపు, గందళించుచు నున్న న•మ ందయాన
పొందు చేకూఱ కెవ్వ రే•చందమునను, మందలించిన సడల దే•మందు సఖుఁడ. 155

క. వారువము లందలంబులు, వారణగమణీమణీని•వసనవసనభూ
షారజితకాంచనము లా, నారీమణిజోక లేక • నా కేమిటికిన్. 156

ఉ. సంగడికాఁడ చేడియలు • చాలఁ గలా రని నీవు నిప్పుడీ
భంగి వచింపఁగాఁ గునె • భావము ం బరికించి చూడుమా
య గ లెం నైన • యాదురె యాపదియాఱువన్నె మే
ల్బంగయి మ కుక్ద రుఁ•బ్రాయపువేలుపుముగుమ కున్. 157

చ. సచివకు ం య కచ•సారసపత్త్రవిశాలనేత్ర ం

దచిరగతి ఘటించి నను • నర్మిలిఁ బ్రోవుము కాకయున్న నీ
యచలగృహప్రదేశమున•యందుఁ దపం బొనరించుచుండి నీ
విచటఁ దొలంగి వేగఁ బురి • కేగుము మాటలు వేయు నేటికిన్. 158

తే. అనుడు నెయ్యుఁడు వెఱఁగంది • యకట యితని, కగ్గలం బయ్యె విరహార్తి • యంతకంత
కింకఁ గానకుఁ దోడ్కొని • యేగి కొంత, వంత మరలింతు నని యంత • సంతసమున.

వ. అతనిం దోడ్కొని చని వనిం బ్రవేశించిన నమ్మహీమహేంద్రుండు. 160

సీ. పొలఁతిపాలిండ్లంచుఁ • బొన్నకాయలు పట్టి, హో యివి పొన్నకా•యలె యటంచు
నతివ వెన్దొడ లంచు • నంటికంబము లంటి, భళి యివి యంటికం•బము లె యంచుఁ
గలికిముంగురు లంచు • నెలదేంట్లఁ బట్టియ, యో యివి యెలదేఁటు•లే యటంచు
మగువకేల్గవ యంచుఁ • జిగురుటాకులు ముట్టి, చెఁబో యివి లేఁజి•గుళ్లె యనుచు

తే. వనితవాతెఱ యని పరు•వంపుదొండ, పండు పట్టి యహో యిది • పరువు గూరి
యొఱుపు మీఱినదొండపం•డే యటంచు, నెంచుకొంచు విరాలిం జ•లించుచుండె.

తే. అపుడు చెలికాఁడు నృపతి క•య్యతివమీఁది
తలఁ పొకించుక మఱలింపఁ • దలఁచికొనియు
నచట నచటఁ జరించుచుఁ • బ్రచురఫణితి
నింపు రాణింప నాతని • కిట్టు లనియె. 162

క. అవె చూతలతలు నునుఁగెం, జివురులతోఁ దేజరిలెడు • క్షితివర కంటే
యఘు నవు ననుం యివి య, య్యువిదకరాజ్ఞముఁ బోలి • యున్నవి సుమ్మా. 163

క. వసుధాధీశ శిరీష, ప్రసవము లవె చూడు సిరులఁ • బరఁగెడు నా నా
రసికుఁడ యిత్తెఱఁగునఁ బొ, ల్పెసఁగుం గద దానిమేని•మృదులత మిగులన్. 164

ఉ. మారెడుపండ్లు చూడు మవె • మానవనాథకులావతంస సొం
పారుచు నెమ్మనంబునకు • హర్ష మొనర్చుచు నున్న వౌ భళా
కూరిమిసంగడీఁడ యల•కోకిలకాకలికానులాపవ
క్షోరుహయుగ్మ మిప్పగిది • సొంపు వహించుఁ గదా యుదారతన్. 165

క. జననాథ మొ మొగ్గలు, గనుఁగొను మవె మదికి ముదము • గదియించుచు సొం
పునఁ దనరెడు నా నిట్టులె, తనరుం గద సఖుఁడ దాని•దంతాళిరుచుల్. 166

క. రంభాస్తంభము లవె సం, రంభం బలరారఁ జూడు • రాజోత్తమ య
య్యంభోజవదనయూరు, స్తంభము లిట్లలరుఁ జుమ్మ • సంగడికాఁడా. 167

చ. కనుఁగొను కేతకీకుసుమ•గర్భదళంబు లుదగ్రవైఖరిన్

దనరుచు నున్నవల్లవె శతక్రతుసన్నిభ మే లయారె య
వ్వనజముఖీశిరోమణియ • వక్రనఖాంకురపంక్తి యివ్విధం
బునఁ దనరుం గదా సచివపుంగవ నవ్యవిలాసలీలలన్. 168

తే. ప్రభుజనోత్తమ చూడుము జపాప్రసూన, మదె మనోహరలీలచే • నలరుచున్న
దాభశా సంగడీఁడ యయ్యన్నుమిన్న, ముద్దుకెమ్మోవి యివ్విధంబున నెయలరు.

క. ఎకిమీఁడ చూడు మిదె చం, పకముకులము లెదకుఁ జాలఁ • బ్రమద మిడెడు న
వ్వికచాంబుజాతముఖినా, సిక యిట్లలరారుఁ జుమ్ము • చెలికాఁడ కడున్. 170

క. పున్నాగమ కనుఁగొను మదె, పున్నాగము ననిచి సిరులఁ • బొలుపారెడు నా
నన్నాగయానపొక్కిలి, యన్నా యిన్నలపగిది • నలరారుఁ గదా. 171

తే. అని వచించుచు వారలు వ్వనిఁ జరించు, చున్నచోఁ గీరశారీమయూరపికమ
రాళరోలంబజాలంబు • వ్రాలి కడుహ, ళాహళి యొనర్ప నులికి యిలావిభుండు.

వ. వెండియు నతని కిట్లనియె. 173

సీ. కొలఁది దయ్యమ్మలు తెఱఁగునఁ జిగురాకు, గుబురులయందున్న • కోకిలములు
బమ్మరాకాసుల • భంగిని జెట్టెక్కి, పదరుచు నున్నట్టి • బర్హిణములు
పురటింబూచుల • పోల్కెఁ బూఁబొదలపై, సందడి నెఱపుని • దిందిరములు
పెనుసత్తులట్లు కంపిలఁ జేయుచును గోనఁ, బొదలి యావడి సేయు • మదశుకములు

తే. మఱియుఁ గపురంపుకమ్మదు • మ్మార మెలయ
వీఁకఁ బై కొనుచిఱుగాడ్పు • సోఁకుశులును
నలముకొనఁగ భూతాక్రోశ • మైనయిట్టి
వనికి నన్నేల తెచ్చితి • వనుఁగ యిపుడు. 174

తే. కుసుమబాణున కెప్పుడు • కువలయనవ
మాలికాశోకకమలరసాలములను
సాయకము లైదు గల వంద్రు • సఖుఁడ యిపుడి
దేమి వని యెల్లఁ దూపులై • హెచ్చు మీఱె. 175

తే. మరునిపూఁదూపు లిందాఁకఁ • గెరలి వెలికిఁ
గా రా కుండ నెదలోనఁ • గా డుఁ గాని
డఁగి యిపుడేమి మేనెల్లఁ • గా డఁ జాఁగె
నుఁ య సోలెఁ బై రాలున లకులికి. 176

సో ధరావరామరాధీ ం క్రమంబున శిశిరోపచారంబుల సేదఁ దీర్చి

నర్మసఖుండు యథా నంబునం జేర్చె నని నారదునకు శారదామనోహరుం డెఱిం
గించిన నతం డతని న వ్వలికథావిధానం బడుగుటయును. 177

చ. పరమకృపానివేశమృదు•భాషణ భోగికులేంద్రభూషణా
హరిహయముఖ్యనిర్జరగ•ణావన సంతతవిశ్వభావనా
కరిదనుజేంద్రదుర్మదవి•ఖండన బాలశశాంకమండనా
యరిబల ద్భయంకరమ•హాగ్రహ కుక్కుటరాజవిగ్రహా. 178

క. స్వర్గాపవ ఫలదని, సర్గా దుర్గాధినాథ • సంఘ తనుమనో
వర్గా దుర్గాయితనగ, భర్గా గర్గాదివినుత•పటు నాశ్మర్గా. 179

సుగంధివృత్తము.

తారకాశతారకాశ•తారకాశరాట్ప్రియ
శ్శారదాభ్రశారదాభ •సామజామరద్రుసీ
హారఫేనహారఫేన•హారిభూరికీర్తివి
స్తార ఘోరబాహుసార•దారితారిమండలా. 180



గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వరకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్య
ధురంధరఘనయశోబంధుర కౌండిన్య సగోత్రపవిత్ర కూచిమంచిగంగామాత్య పుత్త్ర
సకలసంస్కృతాంధ్ర లక్షణకళాకౌశలాభిరామతిమ్మకవిసార్వభౌమప్రణీతం బైన రసి
కజనమనోభిరామం బను శృంగారరసప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.





శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# రసికజనమనోభిరామము

## చతుర్థాశ్వాసము.





శ్రీవిజితకూచిమంచిమ
హావంశాభరణగంగనార్యమనోహరా
జీవాకరచక్రాంగా
గోవల్లభశుభతురంగ కుక్కుటలింగా. 1

వ. అవధరింపుము వారిజాసనుండు నారదున కిట్లని చెప్పం దొడంగె నట్లు ఋతుధ్వ మహీమండలాఖండలుం డఖండపుండ్రేక్షుకోదండప్రచండకాండపరంపరాకంపిత స్వాంతుం డై కలంగుచుండె నంత నక్కడ. 2

తే. వేల్పుకన్నెయు నా రాజవిభు నుదగ్ర, మోహనాకారరేఖ సమ్మోద మొదవ
డెందమున నిల్పి మిగులఁ గడిందివలపు, మొలక లెత్తఁగ నిజగృహంబునకుఁ జేరి.

సీ. పగడంపుఁగోళ్ల హంసంబట్టెమంచము దోమ, తెర జరతారుమేల్పరపు తగటు
చందువా ముత్యాలజాలీలు కుతినీత, లాడ దంతపుఁబావజోడు పసిఁడి
దువ్వెన చిటిచాప తూఁగుటుయ్యెల దివ్వె, గంబము ల్పచ్చలగద్దెపీఁట
జాళువాచందువ ల్జాలవల్లిక తమ్మ, పడిగము నెత్తంపుఁబలక రుద్ర
తే. వీణె వింజామరలు వట్టివేళ్లసురటి, తబుకు కపురంపుబరిణె గందంపుఁగుడక
చిన్నియడపంబు రతనంపుఁజిలుకపంజ, రమ్ములును గలయొకమిద్దెటిమ్మనందు. 4

తే. తొడవు ల యు నెడలించి య లు మించి
యొ లు బ లంగ మ జా గడలుకొనఁగ
మెఱుఁగుకొనగోఁ న్నీరు మీటుకొనుచు
పెడఁదచిటిచాపపై వడి నొడలు వైచి. 5

తే. కళవళింపుచు మే డగడ వడంకఁ, బండ్లు గొఱుకుచు మూల్గుచుఁ బదరి నగుచు

నోలిఁ బండుచు లేచుచు • నులికి పడుచు, నుండె వలరాచబలుబూచిఁ యొదవియబల. 6

వ. మఱియును. 7

సీ. తలయూఁచు నెదలోనఁ • దలఁకి గుప్పనలేచుఁ, జిలుకలఁ గొట్టు నెచ్చెలులఁ దిట్టుఁ
దనలోనఁ దా నవ్వుఁ • గినిసి యంచలఁ జివ్వుఁ, గన్నులు మూయు నల్లడలు రోయు
దైవంబు దూఱుఁ జి • త్తవికారమునఁ దారుఁ, దహతహ చెందు వేదనలఁ గుందుఁ
బిలువకే పల్కుఁ గో • యిలకూఁకలకు నుల్కుఁ, గలవరించు నభంబుఁ • గౌఁగిలించుఁ
తే. గలఁగుఁ బిమ్మటఁ గుడుచు బెగ్గిలు వడంకు, బెదరుఁ గన్నీరు నించు దూపిలుఁ గృశించుఁ
బంచశర ఘోర శిత మాత • భల్లభగ్న, మానసాంభోజ యగుచు నమ్మంజువాణి. 8

క. అటు లుండి కొంతవడి కా, కుటిలాలక యంతకంత • కు న్మనమున మి
క్కుటమై పెరిఁగెడు వెతలం, గటకటపడి యి ట్లనుం దగం దనలోనన్. 9

ఉ. అక్కట పాపజాతిచెలు • లక్కటికం బొకయింత లేక తా
రక్కడ నడ్డు దాఁకి బిగి • యారఁగ నవ్వగకానికౌఁగిటం
డక్కఁ బెనంగనీక మగుడఁగ నొని తెచ్చి మనోజవేదనన్
జిక్కువడంగఁ జేసి యఱఁ • జేసి రహా యిఁక నేమి సేయుదున్. 10

ఉ. ఎవ్వరి వేఁడుకొందు నిఁక • నేగతి నివ్వెత వీడుకొందు నేఁ
డివ్విధ మెల్ల నెచ్చెలుల • కేర్పడఁ జెప్పిన దిట్టుఁ గూళలై
న  లఁ బెట్టి యందఱు వినం గడునాముగఁ దుల్లుకొంచుఁ దా
రవ్వల నవ్వులం బఱపి • యంకిలి సేయక మాన నేర్తురే. 11

ఉ. అద్దిర వా చెల్వము జయంతునిఁ గంతుని నవ్వసంతునిం
దద్దయు గెల్వఁగాఁ దివురుఁ • దప్పక యొప్పులకుప్ప లైనలే
ముద్దులగుమ్మ లాభువన • మోహనవిగ్రహుఁ గాంచినంతలో
నుద్దియుడంగ రానివిరహార్తిదధి బిట్టు మునుంగ కుందురే. 12

ఉ. పున్నమచందురుం దెగడుఁ • బూపని గారవుముద్దుమోము వా
ల్గన్నులు తమ్మిరేకులచొ • కారము దూరము సేయు జాళువా
వన్నియఁ గేరుఁ జెక్కులు క • వాటముదీటు వెడందఱొమ్ము హా
కన్నులఁ గట్టిన ట్టిపుడు • గానఁగ నయ్యెడు వానియందముల్. 13

ఉ. పంటికొలందిఁ జక్కెరల • పానక మూరెడుకావిమోవి పె
న్గంటి యొనర్చి గుబ్బ లెద • గట్టిగఁ జేర్చి కవుంగిలించి పూ
వింటివజీరునాలమున • వేమఱుఁ బ్రేమ దలిర్ప వానితో

జంటc బెనంగ తేనియలు • జవ్వన మేటికి మవ్వ మేటికిన్. 14

క. అని యిటు లనివారితమగు, మనసిజవేదనc గలంగు • మహిళామణిc గ
న్గొని యనుంగుంజెలు లందఱు, ఘనతరచింతాభరంబు • గడలుకొనంగన్. 15

ఆ. పొలcతులార యిప్పుడు • నెలcతకు విరహార్తి, బలిత మయ్యెc జేయు • పని యిc కెద్ది
గలదు చూడుc డంచు • వలగొని యందఱు, నిందువదనc జూచి • యిట్టు లనిరి. 16

క. నీహారకరముఖీ యిటు, లాహా మోహాతిరేక • మలరారc గడున్
హాహా యని సొలయుచు ఘన, సాహసవృత్తిన్ మెలంగc • జను నే చెప్పుమా. 17

తే. కన్నియవు గాని పోడవు • గావు నీవు, కువలయాక్షి రొ సి గ్గెల్లc • గొల్లc బెట్టి
పలుదెఱంగుల నెఱంగc • బాడి యగునె, యహహ నీ డెందమున నింత • యళుకు లేక.

క. బాలా నవమృగమదజం, బాలాంతతమృదుకపోల • భాలా మేలం
జేలా జేలా యిటువలె, మేలా మేలాగు నడల • మెలcగcగ నీకున్. 19

చ. తలcపున నొక్క యన వసు • ధాతలనాథకుమారుc గోరి క్రొం
దళుకుc బసిండివన్నియలc • ద యుc గెర్చె అసోయగంపు మే
న్పలుకలకాcకలం గరcగి • పాఱcగc జేసె ది దేమి మేల్బళా
చిలుకలకొల్కి నీవెడcగుc • జిన్నియ లెన్నcగc గ్రొత్త లయ్యెడిన్. 20

సీ. పెంపార వలి లి • బిలిపాటc బాడుచు, నింపుగా వీణ వా • యింప వేమి
గమగమవలచు చ • క్కనిమంచిగంధంబు, వలుదచన్గుబ్బల • నలcద వేమి
గిమించు క్రొత్త గొ • జ్జంగివిరిసరములు, సొగసుగాc గ్రొమ్ముడిc • జుట్ట వేమి
ళుకుc గొమ్మించుట • ద్దము చూచి నొసలను, దీరుగాc గస్తూరి • దిద్ద వేమి

తే. చిలుకప దల మచ్చికc • జేసి ముద్దు
చిలుక ముకి నెంపుమాటలు • చెప వేమి
కడిcదిరతనంపుcదొడవులు • దొ గ వేమి
తెలుప నీ కిది యేలాటి • తెఱcగు చెప్పుమ. 21

ఉ. చెంత మెలంగునూడిగపుc • జేడెల బి ట్టదలించె దేమి ము
న్నెంతయుc బ్రేమతోc బెనిచి • యిడ్డ మయూరమరా శారికా
సంతతులం గన న్మెఱయ • సారెకుc బాఱ నడంచె దేమి
ంతవతీలలామ యది • మంచిదె నీమది నెంచి చూడుమా. 22

చ మ ససమా ర్తి యని • మాన నాథకుమారశేఖరున్
మ c లపొ లు • మాఱు గృశింపc నేల నీకు స

మ్మెద మగున ట్లొనర్చెదము • మాపలు కిమ్ముగ నాదరించి యో
మదకలహంసయాన విను • మా యనుమాన మిఁకింత యేటికిన్. 23

ఆ. అనుచు నిటు లనుంగు • నన్ఁబోఁడు లాడిన, పలుకు లాలకించి • కలికిమిన్న
కడఁకతో నొకింత • కలఁకలో నుడిగి య, య్యగురుఁబోఁడ్లఁ జూచి • యిట్టు లనియె.

సీ. చెలులార వినుఁడు క•ల్వల ఱేని వల ఱేని, నలువారఁ బలుమాఱు • గెలువఁ జాలు
నల ఱేనిసోయగం • బెలమిఁ గన్నులఁ జూచి, నంత నుండియు డెంద • మతనియందె
తవిలి క్రమ్మఱక వం•తలఁ గలంగఁగఁ జాఁగె, నహహా మోహము నిల్పి • నలవి గాదు
శుకమయూరమరాళ•పికశారికామధు, వ్రతచమూసహితుఁ డై • రతివరుండు

తే. వెతలఁ బఱచుచున్నాఁడు • వేయుగతులఁ
దఱచు లిం కేల యీవేళఁ • దాళఁ జాలఁ
జక్కఁగా మీకుఁ గేల్మోడ్చి • మ్రొక్కు లిడెదఁ
జెలిమి దైవార నసురులు • నిలుపరమ్మ. 25

చ. వినుఁ డొకమాట చెప్పెద న•వీనకృపామతి నాదరించి యి
ప్పని యొనరించి వేదనలఁ • బాపుఁడు మీ రిటు గాక యున్నచో
నెన రెడలించి నాయెడల • నేరము లెంచి చలంబు మించ నో
యనుఁగు వెలందులార కడు • నారడిఁ బెట్టకు రమ్మ వేఁడెదన్. 26

ఆ. అనిన బోటికత్తె • లమ్మ నీకిపు డింత, చింత యేల వట్టి•ఱంతు లేల
నెమ్మి నుండి నీకు • సమ్మదం బొనఁగూర్తు, మనుచు నూరడించి • యనిచి రెలమి.

తే. అటులఁ జెలు లూరడించిన • నాఁ దవిలి
యన్నిలింపాంబుజాతద•ళాయతాక్షి
యతితరాభీప్సితావృత•స్వాంత యగుచుఁ
గొంతదిట మూని యున్న య•నంతరమున. 28

సీ. చెఱకుసింగిణివింటఁ • గఱకుతుమ్మెదనారిఁ, దవిలించి విరిదోన • ప్రవళిఁ బూని
కడిఁదిగేఁదంగిరే•కడిదంబు మొలఁ జెక్కి, సురపొన్నక్రొన్న న•జోడు దొడి
పలుమొల్లసరముల•పాగ బాగుగఁ జుట్టి, మే నెత్తమి పూ•డాలు వట్టి
రాణించుచిలుకప•తాణి తేజీ నెక్కి, గండుఁగోయిలదడు • నిండి కొలువ

తే. నలరువిలుకాఁ డనెడిపేరి•బలుసిపాయి, హాళిఁ బైకొని కో యని • యార్చి పేర్చి
కలికివలిగబ్బిగుబ్బగు•బ్బలులనడుమ, వాఁడివిరిముల్కి డుస్సి పో•వంగ నేసె. 29

క. ఏసిన హా యని సోలి వి, లాసిని వడిఁ దెలిసి పెక్కు•లాగుల వెతలన్

వేసరి యేమియుఁ దోఁచక, గాసిలుచుం జెలిమివెలఁదు•కల మొఱఁగి వెసన్. 30

సీ. పట్టెలఁ గే లూని • పాన్పు మెల్లన డిగ్గి, గిలుకుపసిండిపా•వలు దొడుగక
మినుకుచేలచెఱంగు • మేలుముసుం గిడి, పుడమిపైఁ దడఁబడ • నడుగు లిడుచు
వీడిననెఱికొప్పు • వీఁపున జీరాడ, గాటంపుటూర్పులు • గదలుకొనఁగ
జిలిబిలిచెమటసో•నలు మేన జాల్గొన, జిలుఁగునెన్నడుమునఁ • జేయిఁ జేర్చి
తే. జంటఁ బిలపిలఁ జనుశుక•శారికామ, యూరకాదంబవితతుల • నులికి పాఱఁ
దఱుముకొనుచు నె త్తును • దారి వట్టి, తరలెఁ దగలాక్షి యంతికో•ద్యానమునకు.

వ. అట్లు తరలి చని వనిం బ్రవేశించి. 32

సీ. కమ్మపుప్పొడి ముండ్ల•కరణి నంఘ్రులు గాఁడ, నలరులు మరుతూపు•లట్లు తగులఁ
బికరావములు పెద్ద•పిడుగుల ట్లదలింపఁ, గేకులు పులులట్లు • ఢాక చూపఁ
గొదమతేంట్లు తుపాకి•గుండ్లపోలికఁ దాఁక, నలఁతిగాడ్పులు బూచు•లట్లు పొదువఁ
దలిరుటాకులు కటా•రులమాడ్కి మెయి సోఁకఁ, గపురంబు పెంధూళి•గతిని గప్ప
తే. నడలి యెచ్చోటఁ గా లూన • నలవి గాక, మగలి పూఁదేనెసోనలు • గురియుచున్న
తలిరుజొంపంపులేమావి•తరులనడుమ, మేలికపురంపుఁదిన్నెపై • మేను చేర్చి. 33

తే. ఏమి సేయుదుఁ గటకటా • యించువిల్తుఁ, డేఁచ నిలువెల్లి వనిఁ•జేరు టెల్ల నిపుడు
గనొనఁగఁ బీడ విడచి బి•గాది పట్టి, నట్టు లయ్యె నిం కెచ్చోటి • కరుగ వలయు.

సీ. గ తంపుమొగిలిరే•కడి ంబు అొమ్మునఁ, గదియించి డుస్సిపో• నదుముదాన
ఘేటి, జ్జెఁగ టి•యేటికాలువలోనఁ జాఱు కూని చివ్వన • నుఱుకుధాన
దాక వను బూవు•దండ చేరిచి మె , యిఱియంగ నురి బిగి•యించుదా
విరిదేనెలోనఁ గ•ప్పురము వోసి మెదించి, త యు కొఱ్ఱమ్మడిఁ • ద్రా దాన
తే. గాక యుండిన సితగరు•తోర్కశౌక, కోకిలానీకమత్తమ•ధూకచంచ
రీకశారికదంబంబు • లేక పేర్మి, దాఁకి పైకొన నిఁక నిల్వఁ • ద మె యిందు. 35

చ. అళులుఁ బికంబులు ను కసు • లంచలు శారికలు న్మయూరముల్
గొలగొలలాడుచుండ • కూఁత లిడఁ బెగ డొంది యయ్యయో
చెలుల మొఱంగి యిచ్చటి ( • జేరుట యె ( దలంచి చూ (గా
ములు వె ంచి ట్టు బి • మొ చం ము దోఁచె య్యెడన్. 36

అ మఱియును. 37

--రా య చు రామ •మా య ంచుఁ
జ ధర య చుఁ బలుమాఱు • సంస్మరించు

మకరకేతనపరభృత • మందగంధ
వహులదాడికి నోడి యా • వన్నెలాఁడి. 38

సీ. ముద్దుగుమ్మకు శిలీ • ముఖ మయ్యెఁ దుమ్మెద, యలికుంతలకు సోఁకు • డయ్యెఁ గాడ్పు
కలికికిఁ బుండరీ • కం బయ్యె నెత్తమ్మి, యంబుజాక్షికి బర్హి • యయ్యె నెమిలి
యతివకుఁ బున్నాగ • మయ్యెను సురపొన్న, కోమకుఁ గాండంబయ్యె • హిమజలంబు
కంబుకంఠికిఁ బరా • గం బయ్యెఁ బుప్పొడి, సతికిఁ గోకం బయ్యెఁ • జక్రవాక
తే. మంగభవఘోరసాయకా • యాతయాత, నావికంపితహృదయరా • జీవ యగుచు
నంతకంతకు సంతాప • మతిశయిల్ల, నుపవనంబునఁ బ్రచరించు • చుండునపుడు. 39

క. అత్తఱిఁ బుత్తడిగీమున, బిత్తరిఁ గానక కరంబు • బెగ్గలి యనుఁగు
గత్తియ లందఱు నొకచో, మొత్తము లై తత్తరిలుచు • మురిస లంగన్. 40

ఉ. హా లలనాశిరోమణి గృ • హంబును వెల్వడి మన్మ సల
జ్వాలల కోర్వ కెచ్చటికిఁ • జాఁగనొ యెయ్యెడ నేమి యయ్యెనో
హైశమ చూడరే యనుచు • వాపిరి నారయుచున్నయప్పు డా
బాలికచంద మంతయును • బంజరకీరము తేర్పరించినన్. 41

క. విని వనిత లహహ నిర్భయ, మున నేమరి యుండి మో • పోతిమి గదరే
యని వని కందఱు గొబ్బునఁ, జని చెలి నం ద వెదు ( • జా గి డంకన్. 42

సీ. ఈకప్పురపుఁదిప్ప • యెక్కి యెక్కి యెంతసే, పెలనా వల నొస • నిలిచి యుండె
నీగుజ్జులేమావి • యిపురుజొంపమునీడ, బడఁతి యించుక సేపు • ప వ్రాలించె
నీమిటారపుఁజంద • మామరాతిన్నెపైఁ, గోమ యించుక సేపు • గూరుచుండె
నీవేడబపుమొల్ల • పూవుకొత్రింబొదరింటఁ, జా యించుక సేపు • సంచరించె
తే. నీనిగారంపుద్రాక్షాల • తానికాయ, కాయమానాంతరంబుల • కడ నెకింత
సేపు నాళీకపత్రాక్షి • సేదఁ దీర్చె, కొనిమెఁ గన్గొనరమ్మ యో • కొమ్మలార. 43

సీ. పాను పెక్కఁగ లేక • బడలుచేడియ యెట్టు, లీకప్పురపుఁదిప్ప • లెక్క నోపె
విరిదీఁగె సోఁకి వే • సరుబాల యెట్టు లీ, కారుపూఁబొదరిండ్లు • దూఱ నోపె
వీణాధ్వనుల కుల్కు • వెలఁదుక యెట్టు లీ, ఘనపికారావము • ల్వినఁగ నోపెఁ
దాలవృంతములకుఁ • దలఁకుపైదలి యెట్టు, లీసుడుగాడ్పుల • కెదుర నోపెఁ
తే. గేళికాగారములపొంతఁ • గేళికులుల, జోరవెలచుజోటి యెట్టు లి • చ్చోటిమేటి
తేటగొంగిపూనీటి • యేటికాల్వ, దాఁటనోపెనో కదరమ్మ • బోటులార. 44

సీ. ఎద వ్రపు లాదవంగ • నీదుండగపుగండుఁ, గోయిలఁ గాపింపు • గూయుచుండ
మేను చిల్లులు వోవ • నీనాలివలిగాడ్పు, మూఁకలు పైపైని • సోఁకుచుండఁ

దలదిమ్మ ఘటియిల్లఁ • దవిలియాతాటోటు, మొకరితుమ్మెదదిమ్మ • మొరయుచుండఁ
గనుదోయి నెఱిఁ గప్పఁ • గడఁగి యాబలితంపుఁ జుఱుకుఁగప్రపుబూది • పఱమచుండ
తే. నెక్కుతెయుఁ గోనఁ ద్రిమ రు• చుండి మెండు
కొనుదొసంగులఁ బిమ్మిటిఁ • గొనుచు మనలఁ
దలఁచి యమ్మకచెల్ల యం• వ్వేలఁది యెంత
వంత నడలెనొ కదరమ్మ • యింతులార. 45
సీ. ఈబిసంబులు చూచి • హేలావతీమణి, పాఁపకూటువ లంచు • భ్రమసెనేమొ
యీపికంబులఁ జూచి • యిందీవరేక్షణ, చెడుఁగుసోఁకుడు లంచు • జడిసెనేమొ
యీనెమ ను జూచి • మానినీతిలకంబు, బలుకార్ముకమ లంచుఁ • బఱచెనేమొ
యీకెంద రుఁ జూచి • రాకేందుబింబాస్య, దవవహ్ని యనుచు లోఁ • దలఁకెనేమొ
తే. య హా పసిబిడ్డ కిట్టిఘో • రా త్రి యొదవె
నేమి సేయు మే మంద • మెటుకుఁ బోద
మెవ్వ ని వేఁడుకొంద మిం • కిపు డటంచు
నోలి దిరుగుచుఁ జని చని • యొక్కచోట. 46
• ముసుఁగువాయ గఁ ద్రోచి • కసరి దిగ్గన లేచి, య త్తి నలుగడ • లరయుదాని
మాటి బ జా • నాటి క్రొవ్వేఁడిక, టిజా ల్గొనగోట • మీటుదాని
ఘోచ్చ చ్చటసెకఁ గం , యుసు రంచు నిట్టూర్పు• లుచ్చుదాని
బెడి ం మదకీ • కరావముల కులికి, సెల్లుగా మదిఁ దల్లి• ల్లుదాని
తే. నసురు లూడాడ విస • విసరి ముసరి
దొసఁగు లెసగించు రు గాడ్పు• తుటుము దాడి
క లి త యు గడగ • వడఁకుదాని
వేల్పురాక ఁ గాంచి రా• వెలఁదు లపుడు. 47
తే. కాంచి ద ల నుండియే • సఁకఁ బఱచి
పొద కొని యశ్రుజలపూ • ము మెఱుంగుఁ
బోఁ మై తొప మార్చుచుఁ • బ్రోడ లైన
గుఁ రా రాకుఁ ం - దరమున. 48
ల చంగ ు మే ం• పెం, విరులు, పడఁ మిన్నకుఁ జుట్టి రా • బడిసి వైచి
కప్పుగ ట • ఁ బెట్టి, యఱు ఁ గురువేరు గట్టి నె• య్యమున ననిరి.
ఉ కొ మ్రు పువెత • గుందుచు ని ల్లడఁబాసి యిమ్మెయిక్

మమ్మఱ చేసి యొంటిగ వ•నంబున కేటికి వచ్చితమ్మ నె
త్తములఁ గేరునీమృదుప•దంబులు గందెఁ గదమ్మ మేలు మే
లమ్మ చెల్ల నీబలుగ•యాళితనమ్ములు చెప్పఁ జిత్రముల్. 50

క. కన్నెల నెందఱి నేనియుఁ, గన్నులఁ జూచితిమి గాని • కటకట యిటులన్
మున్నెన్నఁడు నీపగిది, న్మిన్నఱికలఁ బొరలుమాని•నులఁ జూచితిమే. 51

సీ. కుజనులఁ జేరి చొ•క్కుచు శీధుపానంబు, సేయుచుండాలు లీ•చెనఁటి తేఁటు
లడవులఁ దెరువరు • లడలఁ గేకలు వెట్టి, పఱచుశిఖండు లీ•బర్హిణములు
పలుగాకిమూఁకలో • బ్రతికి పంచమరీతి, నెసఁగుకాలాక తు • లీపికములు
విషము విదుల్చుచు • వెస ఘనవిముఖతఁ, జనుజాలపదము లీ•సారసములు
తే. పూని నిరతంబు చెలరేగి • పుణ్యతరుల, ఫలము లె ను బడఁ ద్రోయు•పత్త్రవాహ
లీశుకంబులు హా వెఱ • పింత లేక, వనజదళనేత్ర యిం దేల • వచ్చితమ్మ. 52

తే. ఆమెఁ గానము మంచిది • యబల యింకఁ, గొంక వలవదు నీమది•కోర్కె లెల్లఁ
దీఱు నిప్పుడు వ తోనఁ • దూఱి పూలు, గోయుదము రమ్మ తహతహ•కొంతదీఱ.

తే. అనుచు వనజాతలోచన • నత్తెఱఁగున, నాడి సంగడిపూఁబోఁడు • లంత నచటఁ
దర పుష్పాపచయబు • దలఁచుకొనఁగ, వరుస నందఱు శృంగార•వనము చొచ్చి.

తే. క్రొమ్ముడులు దిద్ది కంచుల్ • గదియఁ గట్టి
మొలల నవరత్నమయకాంచి•కలు బిగించి
యందియ ల్పాదకటకము • లొప్పందుపఱిచి
యొండొరుల మీఱి వేడుక • లెమ్మెండుకొనఁగ. 55



మ. అళులం జోపుచుఁ బువ్వుఁదేనియల నెయ్యం బొప్పఁగాఁ గ్రోలుచున్
ఫలము ల్మెక్కుచుఁ దీవపందిరులలోఁ • బల్లాఱుఁ గ్రీడించుచున్
గలకంఠంబులఁ దోలుచున్ సుమపరా•గంబు తిం జిమ్ముచుం
దలిరుల్ జొంపము లెల్లఁ ద్రుంచుచు సుధా•ధామాననల్ నెమ్మదిన్. 56

మ. వలిగప్రంపుటనంటిబోదియఁ గ్రే•కు న్గుజ్జులేమావిమ్రాఁ
కులనీడన్ బలుదాకపందిరులలో • గొజ్జెంగపూనీటివా
కలపొంతం గురువిందపెన్ బొదలలో • గాటంపుఁజెంగల్వబా
వులపజ్జ న్నెలరాలదిన్నియలఁ బ్రో•వుల్గూడి క్రీడించుచున్ 57

సీ. మిహికాంశుముఖి యొర్తు • హాకారభూజంబు, కలికి యొక్కతె తిల•కద్రుమంబు
కరిరాజయాన యొ•క్కతె ంధువారంబు, కోమలి యొక్కతె • కురువకంబు

శతపత్రపత్రలో•చన యోర్తు వకులంబు, సుందరి యొకతె యా•శోకతరువు
కలకంఠకంఠి యొ•క్కతె ప్రేంఖణంబును, సన్నుతాంగి యొకర్తు • పొన్నమ్రాను
తే. సఖి యొకతె గోఁగు నొకయింతి•చంపకంబు
నలరు లెత్తించి చెలిమిఁ జే • నంటి చూచి
యూర్చి కౌఁగిటఁ బెనఁచి క • ల్లుమిసి తాఁచి
పాడి నగి పల్కి యానన•ప్రభలు నెఱపి. 5

తే. మఱియు వనియెఁ గలయఁ ద్రిమ్మరి యుడుగక
మెదలుటక్క ండుఁదు•మ్మెదలు వ్రేలయఁ
బొదలు గాటంపుఁగ్రొవ్విరి•పొదలు దూఱి
ననలు గోరి సరసిజా•ననలు చెలఁగి. 59

సీ. పొన్నపువ్వులు గోసెఁ•బూఁబోఁడియొక్కతె, మొగలిరేకులు ద్రుంచె•ముగుదయొకతె
కుంద ముదిమె నిం•దిందిరాలక యోర్తు, చంపకంబులు గిల్లెఁ • జాన యొకతె
.. ల లజ్జవంబులు గోసెఁ జెలి యోర్తు, భండీరములు ద్రుంచెఁ • బడఁతి యొకతె
దాసనంబులు గోసెఁ • దరుణీమణి యొకర్తు, పాటలంబులు గోసె • బోటి యొకతె
తే. హాళి దైవార దైవతా•బ్జాస్య లెల్ల, రేసి తమనాభినఖదంత•నాసికాంఘ్రి
భుజ దచ్ఛదతనుగంధ•ములకు సాటి, గా వివి యటంచు నిరసించు•కరణి నపుడు.

తే. చెఱుపట్టిల్లును గ్రొమ్మావి•చిగురువాలు, నలరుఁదూపులుఁ బూని కో•కిలశుకాలి
బలములోఁ దూఱి తా మనో•భవుఁడ నంచు,సతుల బెదరించె నొకసరో•జాతవదన.

తే. కురులు జడ యల్లి మందార•కుసుమ మునిచి
కప్పురపుబూది మైఁ బూసి • గొప్పమల్లె
విరి రుద్రాక్షలుగా మహే• శ్వరుఁడ నంచు
దా నదలించె నొ మత్త•దంతియాన. 62

క. వెండియుఁ దమలోన. 63

రగడ. వనిత వనితరు లలమి నేరుపు• లన వల నగుననలు ద్రుంచుము
తనరుతనరుచి నెఱపుచున్నది • దబ్బ దబ్బుఱ గాదు కాంచుము
లదు వల దుర ... యనంటు వంత ... ంతల కెల్ల నీరము
లికి ... కివెడ ద న్ను ... ... గప్పు పు... దుమారము
... మెల ... దు•మ్మె లు మెదలెడుపొదలఁ దూఱెదు
జా ళగుచు ... బంలర•సాలసాలము లెక్కి జాఱెదు

పూని పూ నిలు వెల్ల నసచిన•పొన్నపొన్నల నీడ నాడక
మాని మానిను లెల్ల మె న • మల్లిమల్లియ లాఁగి రోడక
తెలివ తెలివడిఁ బూని దలిచి• తేని తేనియసోనవానలు
నెఱయు నెఱయువిదలకు వేడుక • నించు నించుక యలరుఁగోనలు
సారసారససౌరభము వెద•చల్లుచల్లని కొలనిచెంతను
జేరి చేరిక నాడుకొందము • చెలువ చెలు వలరఁగ నొకంతను
దలరెఁ దలరెడువిరులు దొరకిన•దాఁక దాకఫలంబు లేరక
యలసి యలసికతామయంబుల•యంద యందఱు నుంటి రూరక
మాను మానును మొల్లక్రొంబొద•మఱుఁగు మరుగురుపదము భామిని
కాన కాననఁబోండ్లు చనియం•గదలఁ గదలక నిలిచి రామి
నెన్న నెన్నడుఁ జూడ మిటు పరు•వేల వేలతరంబు పు ´ లు
కన్నె కన్నెఱఁ జేసి కోపము • గ్రమ్మఁ గ్రమ్మఱఁ జనెదు దవ్వ...
కొమ్మ కొమ్మదుపూఁతసంపెఁగ•కొమ్మ కొమ్మని తఱిమి చూపకు
మమ్మ మ మ్మఱ చేసి తేఁటుల • మాటిమాటికి నెడలు వాపకు
మహిల మహిల కడిందియలరుల • మనికి మనికిత ముడిగి చూడుము
బహుల బహులలకొఱకు నెల్లెడఁ • బర్వి డఁ బోక వీడుము
సేనసేనలు గూడి ముద్దులు • చిలుకఁ జిలు లు మెఱయు నిచ్చటఁ
జాన జా నగునవలు వెదుకఁగఁ • జాఁగి జా గిటు లేమి ముచ్చట
యేమె యేమె య్యెనఁ జని వన • మెల్ల మెల్లన గాలి చేసెదు
రామ రామక లఁ గ్రాలుస•ర మ్ముగమ్మునఁ దీసి ´సెదు
పొగడ పొగడఁగఁ దగు హా నిను•బోఁటిబోటి నితావులు
తగవె తగవె మరుండు పొద కుఁ • దా తారి తొలంగు వులు
మధుపమధుపవనేందులను బగ • మాన మానసము ( దలం మె
మధురమధురసకుసుమములు పలు•మాఱు మారు కిడి భజింతమె. 64

తే. అనుచు వనకేళి సలిపి ల•తాంగు లె (, జా లరులు దలిరులు • ంగ్రహించు
ఘర్మజలబిందువులఁ దోఁగి • కడఁక మెఱయ, నంత జల ళి గావిం • దను దలఁచి.

సీ. యక్షనాయకునిభాం•డాగారమునఁ బోలె, మకరకచ్ఛ న •మహి మగుచు
గమలామనోహరు•కరతలంబునుబోలెఁ, బటుశంఖచక్రవి•స్ఫార మగుచు
బృందారకాధీశు•మందిరంబునుబోలె, ననిమిషామృతపరి•వ్యాప్త మగుచుఁ
గామనీయకతార•కాపథంబునుబోలె, ఘనరాజహంససం•లిత మగుచు

తే. భూరిదిఙ్మండలముఁబోలెఁ • బుండరీక, కుముదసంసక్త మగుచు నం•తుల్యదీలఁ
జాల నొప్పారుసారకా•సార మొకటి, గాంచి రప్పు డవ్వియచ్చర•కమలముఖులు.

సీ. సమదరథాంగభా•స్వరపయోధరయును, మీచీనపాఠీన•లోచనయును
శైవాలవల్లరీ•జాలధమ్మిల్లయు, వికచనవీనార•విందముఖియు
నతులగంభీరతా•రావర్తనాభియు, రంగదుత్తుంగత•రంగవళియు
విలసన్మహోదగ్ర•పులిననితంబయు, డిండీరదరహాస•మండితయును

తే. గంబుకంఠియుఁ గలహంస•గామినియును, రామకమిళిందమాలికా•రోమలతయు
నగుసరోవరలక్ష్మి యా•యబ్జముఖుల, కతులితామోద మొసఁగ నా•య్యవసరమున.

తే. అమరనారీశిరోమణు • లతిత ప్ర, హర్షమానసలై యప్పు • డక్కడింది
తమ్మికొలను నిరీక్షించి • తత్తటమున, వసనమణిమయభూషణా•వలులు వెట్టి. 68

చ. గడితపు గావిపావడలు • గట్టి కుచంబులబంటి నీటిలోఁ
దడయక చొచ్చి హెచ్చరిక • దార్కొన నుమ్మడి నోలలాడుచున్
దొడరి పిసాళిజక్కవలఁ • దుమ్మెదదాఁటుల నంచబోదలన్
మడువునఁ బాఱఁ దోలుచు సుమ•గ్రవిలాసవిహారలీలలన్. 69

చ. కరివరయాన యోర్తు బిస•కాండము చిమ్మనగ్రోవి చేసి య
బ్బురముగ నోర్తు మీఁదఁ దనపుం•క్కిటినీరము చల్లి నీటిలో
సరగ మునింగె దానికచ•సంతతి యంచును నాఁచుఁ వని
బ్బురముగ లాగ నచ్చెలువ • పైదలు లందఱు నవ్వి రొక్కటన్. 70

తే. ఉవిద యొక్కతె వేతి లం•నుండి నీటఁ, దేలుచో నొక్కరాయంచ • తివిరి తమ్మి
మొ యంచును దానిచ•న్మొగడ పొడువఁగ, కి యలికి యొకించుక • యులికిపడియె.

క. నలిన ముదాదికము ల, త్తలునీమము లెల్లఁ గోయు•తటి నొకచె చే
తుల ముట్ట దయ్యె లినం బులు కన్నులఁ జూడ దయ్యెఁ • కుముదంబుల్.

ఉ. చంపకగంధి యోర్తు మద•షట్పదపంక్తులఁ దోలె ంచలన్
బై పఱఁ సె నొక్కజ •భృఙ్గనవేణి శాళినా ముల్
ప్రుం ( దొడంగె నెచ్చ క•త్తో నొకమ గజేంద్రయాన కం
పిం ( ( జేసె నొక్క శశి•బింబ భానన చక్రవాకులన్. 73

చ. మె (తుక యోరు తమి •వి మీఁదటి తేఁటులఁ జోఁప నయ కుల్
చెలివ నా బు ం కుఁ దినఁ గేళిసరోరుహాంబుచేఁ
బలుమ ఁ దోలుకొన్న డి • పాఱక యున్నఁ గలంగి దానిపైఁ

దలఁగక చల్లె వేసలిని • దాల్చిన గాటపు గ్రొత్తసంపెగల్. 74

క. అలివేణి యొకతె యొకతో, న్యాలిపై నోల యిడి పఱచి • యంబుజషండం
బుల నడుమ డాఁగ దాసిం, బలిమిం బోనీక పట్టి • పడఁతి గలంచెన్. 75

క. అప్పలఁ బడి యొకచేడియ, తెప్పునఁ దేలంగ లేక • తిరుగుడుపడుచోఁ
గొప్పొడిసి తిగిచె నొకచెలి, యప్పలఁ బడువారి బ్రదుకు • లట్టివ కావే. 76

తే. ముగుద లుమ్మడి సరసిలో • మునిఁగి తేలు, నపుడు కచముల జాఱు నీ • రనువు మీఱెఁ
గలికిమిన్నలఁ గ్రొవ్వేద • ఘనము లగుటఁ, బెరసి ధారాళవర్షము • ల్గురిసెనఁ. 7

చ. నెలఁతలు నీటిలోనఁ దమ • నీడలు గన్గొని చెల్వచెల్వ లం
చెలిమిని గౌఁగిలించుకొన • నేగెడు చందము దోఁప బాహుశా
ఖలు నెటఁ జూచి యీఁదుచును • గ్రన్నన లోనికి డిగ్గి డిగ్గి యం
గలఁగఁగఁ ద్రొక్కి యేమియును • గానక యబ్బురమంది రందఱున్. 78

సీ. కరిరాజయాన యొక్కతె గాసి వెట్టఁ దా, మగసాక్షి హంసమధ • మఱుఁగు దూఱెఁ
దుహినాంశువదన యొకర్తు గలంపఁ జక్రసు, స్తని యహిరోమా • వెనుక నీఁగె
మదకీరవాణి యొకర్తు దలంకఁ జేయ బిం, బోష్ఠి సాంకవగంధి • యొద్దఁ జేరెఁ
గలకంఠకంఠి యొక్కతె సొంపఁ దలిరాకుఁ, బోఁడి రామాంగి దా • పున వసించెఁ

తే. కమలకల్హారకువలయ • కుముదసముద, యాంచితామోదమేదురో • ద్యత్సరోవ
రాంతరంబున లీలావి • హారసరణి, నమరె హేమరుగ్వదన లో • లాడునపుడు. 79

క. మునుఁగుచుఁ దేలుచు నీఁదుచు, ననువుగ నుదకంబుఁ జల్లు • లాడుచుఁ బసుపుల్
గొని యొలలిడుచు చొండోరుఁ, జెనఁకుచుఁ జేడియలు క్రీడఁ • జేసిరి నెమ్మిన్. 80

ఆ. అంతఁ గొలను వెడలి • యింతులు దరిఁ జేరి, కుంతలంబు లార్చు • కొని విభూష
ణాంబరాదికంబు • లలరించుకొని సంత, సమున మరల వనికిఁ • జని యొకెడల. 81

తే. వలపుఁ గ్రంపుటనఁటి మ్రాఁ • కుల కెలఁకుల, జాలువాఱెడు చలువగో • జ్జంగినీటి
యేటికాల్వల నే పొందు • మేటిదాక, తీవవలిఁ గొన్న గుజ్జు లే • మావిక్రింద. 82

తే. కొమరుదళుకొత్తఁ జెఱకుఁగం • బములు నిలిపి, యలరుపందిరి వైచి కెం • దలిరుటాకుఁ
దోరణంబులు గట్టి సిం • గార మెలయఁ, గమ్మగేదంగి రేకుద • మ్మపటము. 83

క. నును పగుమృగమదపంకం, బున దీనియ దిద్ది కప్ర • పుంబొడి ముగ్గుల్
నినిచి లవలిదళములపై, మనసిజరతిసతుల వ్రాసి • మఱి యద్దరులన్. 84

తే. తద్బలంబుల వ్రాసి గం • ధప్రసూన, ధూపదీపప్రముఖషోడ • శోపచార
ములు నిరంతరభక్తిచే • బూజ సేసి, చిగురుఁబోఁడులు డాకొని • పొగడి రపుడు.

క. దండము నీ కిదె జగదు, ండభుజాదండనిహిత•తతసుమనశ్శో
దండవినిర్జితశుకలా, జాం స్థితజంతుజాత • హారిసంజాతా. 86

సీ. ఎడప కెప్పుడుఁ గన్ను • లెఱ్ఱఁజేయుబలంబు, గంటి సేయక యెద•నంటుతూపు
వట్టిమ్రోఁకులు చివు • ర్వెట్టించుదళీవాయి, మి న్నంది యేపున • మెలఁగుతేరు
తునిఁగియు మొలచున•ద్భుతపుఁగన్నులవిల్లు, తనకుఁ దా మొఱయుబి•త్తరపునారి
చుఱుకు మీఱఁగఁ బండ్లు•గొఱుకు టెక్కెలజక్కి, నీళ్లలో జాడలు • నెమకు సిడము
తే. గలిగి యలిగినపతుల శృం•గారవతుల, గతులఁ బెనయించి హాళిమై • నతుల గతులఁ
గేరు నేరుపు నీకె చే•కూరె నౌర, మహితసుకుమార మార ర•మాకుమార. 87

క. కొంకక యెపుడును నీపద, పంకరుహాధ్యా నరూఢిఁ • బరఁగుదు మదనా
సంకల్పసి యిడుము వి, శంకటశృంగా విభవ•సంకల్పభవా. 88

క. కమలభ వము మర, సముదయ మతు కొందు నీని•శాతప్రసవా
స్త్రము కిఁక లెదురే, సమదోద తిక్కగగమన • శంబరదమనా. 89

తే. హాళిఁ జలపట్టి మృదుకుసు•మాశుగముల,యతులదృఢమానసములు బ్ర•యోగ్యలుగఁ జేయు
నీపరాక్రమరూ వర్ణింపఁ దరమె,విరహిణీపాంథజనజైత్ర • విష్ణుపుత్ర. 90

చ. పనివడి యింత నీయెదురఁ • బల్కుటఁ దెల్పఁగ నేల బాల న
నవరసార్వభౌముఁడు వ•శంవదుఁ డై కడు గారవించి నీ
నులఁ గరంగఁ జేయు నెడ • బాళి దలిర్పఁగ నీకు నెంతయుఙ్
నిచినకూర్మి నుత్సవ మొ•నర్చుఁ జువీ సరసీరుహాంబకా. 91

తే. అనుచు నతనుని బ్రార్థించు•కొని మెఱుంగుఁ
బోఁడు లక్కన్నెఁ దోడ్కొని•పోయి నిజని
కేతనము చేర్చి యతితర•ప్రీతి మెఱయ
నరయు చుండిరి మఱి తద•నంతరమున. 92

క. బంధూకప్రసవనిభా, బంధురుఁ డై యపుడు పద్మ•బంధుఁడు గ్రుంకె
ంధుపరమణీవేణీ, బంధంబున జాఱుపికిలి•బంతియపోలెన్. 93

సీ. చరమాద్రిశిఖరసం•చరదభ్రచరవధూ, శ్రేణి గట్టినతోఁపుఁ•జీర లనఁగ
నంబరారణ్యభాగంబునఁ దళుకొత్తు, గు లేమావిచి•గు ళ్లనంగ
బు వ్వరురా •రా శ్రగ డై, బ లుపారుజేవురు•పూఁత లనఁగ
మణులు మ ల లాడెడు, గడితంపుబఙ్గండి•పాదు లనంగఁ
ఆ. మ మత్తేభరా ము•ద్వ తిబయలు, వెడలుచు మేనఁ గనుపట్టు • వితతగైరి

కప్రభాచ్ఛటాలనఁగ నఖండలీల, సంజకెంజాయ లలరె దిశాముఖములు. 94

చ. తఱి యను లోహకారకుఁ డుదగ్రతఁ బశ్చిమశైలశృంగముఙ్
గుఱిగొని వేలుపుందెరువు • గొప్పపిరంగునఁ జాయమందులోఁ
గొఱలెడువిన్నుమానికపుగుండు ఘటించి యగాదు చేసినం
దఱచుగఁ గ్రమ్మ్రక్రొంబొగ లంతంగ జగంబునఁ బర్వెఁ జీఁకటుల్. 95

తే. రవళిఁ గువలయహితుఁ డగురాజు సారి, వచ్చునెడల విభావరీవనరుహాక్షి
చెలఁగి చల్లినముత్తెంపుసేసఁబ్రాల, ంగఁ జుక్కలు దట్టమై • నింగిఁ బర్వె. 96

చ. విరహులఁ గెల్వఁ గోరి నవవిల్తుఁడు బల్తుఱు తూని పుష్పలి
ట్పరభృతకేకిసంఘములఁ • బం పిడి తాను విశ్వరూప మ
చ్చెరువుగఁ దా నో యనఁగఁ • జీఁకటి లోకము లెల్ల నిండెఁ ద
త్కరపరిముక్తసం విశిఖంబు లనం దనరారెఁ దారకల్. 97

క. చిత్తజుఁడు జగముపై దం, డెత్తుచు నని యిడ్డ మదపుటేనుఁ గనంగా
హత్తుకొని దిశలఁ దిమిరము, ముత్తెపుఁజౌడోలి యనఁగ • మొనసెం దారల్. 98

ఉ. కోకతతు లి యోగహతిఁ • గూయఁ దొడంగె దివి న్సుధాంశుమే
ల్లోక మదిం దలంచి దినలక్ష్మి వడిం మతేని హేళి ను
గ్రాకృతి మీఱునుకరుఁ • ంచు స ంపక యేటఁ ద్రోచె ం
చాకులవృత్తి విష్ణు ద • మంటి మొగి న్మొఱ వెట్టుకైవడిన్. 99

సీ. గురులఘువ వైఖరులు గణింపక, విశ్రమస్థలములు • వెదుకఁ బోక
కనదలంకారలక్షణము లెఱుంగక, పదములఁ దుఁ ట్రుపాటు విడక
సాధుసు కప్రసంగము ల్గానక, స సనా గ్గచ్ఛలు దలఁప
క ృక క్రియాగతులపై మతి లేక, లలిత బంధలీలలు తెలియ

తే. తమము ని డార ధూర్తవర్తనులఁ గూడి, తవిలి విహరించి రప్పు డుద్దామవృత్తిఁ
గుకవులనుబోలె గణ ( జెందకయ భాగ్య, భాజనము లైనజారనా జనములు. 100

చ. ఎనయఁగ మచ్చు చల్లి భ్రమయించి కడుఙ్ వరంబు సి చి లోఁ
గొని మఱి యి వ ల్ద విశొంచు సుఖో ఁ జొక్క యున్న చో
ననువు దలంచి దోఁచుకొని • ర డు ముప్పి గొన్న వేడ్కలఙ్
కు సొమ్ము లుమ్మ • ద రులు న్వెలముద్దుగుమ్మలున్. 101

సీ. అనిమిషేంద్రవధూటి రామ్ర శ్రగవీథిపైఁ, గొఱలు మేలుపసింకుండ యనఁగఁ
బ్రాచీదిగం నాఫాలభాగంబునఁ, బొ లుకుంకుమచుక్క బొ ట్టనంగ

రజనీజలజపాణి • రహిఁ గేల నిడి యాడు, బలుదమ్మికెంపుఁరా•బంతి యనఁగ
విరహులపై దాడి • వెడలు మరుఁ డిమ్ము, గొలిపినశకలా•తులీ గొల్లెన యన

తే. విన్ను ద్రిమ్మరి నవఁబోఁడ్లు • వెన్నునఁ
బూజ సల్పినకెందమ్మి•పూ వనంగఁ
గొమరుదళుకొత్తఁ దూరుపు•కొండమీఁద
దంబు మీఱుచు నిందుబిం•బంబు వొడమె. 102

క. విను పుడమిం జిగిరించి జిగి, ననువారెడుగజ్జుమావి • యన శశిబింబం
బొనరార నందుబొందుగ, గొనబారెం గందు గందుఁ•గోయిల యనఁగన్. 103

మ. సరసం బై వసుగంధసంకలిత మై • సనా గ్గసంవ యై
పరరు క్మండ హారి యై శతభిష•క్ప్రాణప్రియం బై భా
స్వర లం దమ మెఁ బో నిడుచు తా•వం బూ చంద్రోదయం
బరు దై శోభిలె నత్తఱిం గువలయా•హ్లాదంబు గా-వించుచున్. 104

క. మఱుఁ డొకటి నఖిలపథికాం, బురుహదళేక్షణల నేయఁ • బూనిన తెలిదా
మరవిరి యన నంత సుధా, కరబింబము ధవళరుచులఁ • గర మలరారెన్. 105

క. తిమిరపిశాచం బాశా, రమణీమణి నాక్రమించి • రాయిడిఁ బెట్టన్
సమయోగ్రమాంత్రికుఁడు వేఁ, గమ చల్లినబూది యనఁగఁ • గౌముది యొప్పెన్. 106

సీ. బహుళ వంజీవ•సటలి మాపలు దీరెఁ, గవ వీడి జక్కవల్ • కడలఁబా
గడితం చిమ్మచీఁ•కటులు దిగ్గన జారెఁ, శశికాంతమణితతు • ల్జాలువారెఁ
దెరువరిగములపై • మరుఁడు దాడివు నూరెఁ, విరహిణీనికరంబు • వెతలఁ దారెఁ
గులటల కాత్మన• లపుఖేదం బూరెఁ, దొంగలేమ కరిదిసో•యగము మీరెఁ

తే. కమలముకుళాంతములఁ భృం•గములు దూరెఁ, దవిలి క్రీడించుభోగుల•తాపమారె
ధర నశేషజనామోద•కరము లగుచుఁ, బండువెన్నెల లెల్లెడ • నిండుటయును. 107

తే. అప్పు డమరాంగనలు మనో•హరవిలాస, లీలఁ జెలరేగి మధ్యంబు • క్రోలఁ గోరి
కనకపాత్ర శీధువు • నునిచి యునిచి, కూర్చుండి ఒదలు నొక్కచోఁ•గూరుచుండి.

ఆ. కనకమయగళంతి•కల నా వము.ముంచి, యాఱుకొనుచు సొలసి • వీనుగవలు
మూఁకొనుచుఁ గదంబ•ము నిచ్చగించుచు, విప్పు మీఱు గ్రుడ్లు • ద్రిప్పుకొనుచు.

యా చు డు, నిహి యని న కొనుచు • హేలాగతిమై
వ ఁ బున నిహికా వదన లాము•మీఱఁగ మఱియున్.

తే. సు యి కే పు వ్వ ఁ

మదిర దొరకెను మనభాగ్య • మదిర యనుచు
నమరవరవర్ణినులు కోర్కె • లమర నప్పు
డానఁ దొడఁగిరి మధు వెద • సాన వెడలి. 111

క. ఆసవముచవి యెఱుంగక, యాసవభాగములు గోరి • యడ లొందిరహో
వాసవముఖులైనస్వర్గా, వాసవరుల్ దెలివి లేని•వారలు గారే. 112

సీ. మధుదైత్యమదనుఁ డి•మ్మధువు గోరెలక కదా, యతితరం బైనకా•ర్శ్యంబు నొందె
మదనవి షి•యి•మ్మదిర యానక కదా, కడిఁది మిాఱఁగ నీల•కంఠుఁ డయ్యె
వాసవుఁ డాస•వంబు దాగ్రవక కదా, తనువున దుర•గత్వము వహించె
నరుణగభ స్తి యీ•సుర భజింపక కదా, ప్రబలయక్ష్మ మయ•బాధఁ గుందెఁ

తే. గరటిముఖునకుఁ గడుఁ బె•కడుపు యతు,నాథునకుఁ గష్టరోగంబు•నాటుకొనియెఁ
జెనఁటులై శీధుపానంబు సేయ కున్న, కతన మనభాగ్యమున నిది • గలిగె భళిర.

వ. అని మఱియుం దమలోన. 114

తే. చంద్రికలు గాయుపరిపూ•చంద్రుఁ జూచి
నోయి వెన్నెలదొర బా•యురక నన్నుఁ
జూచి నగియెద వే మంచు • సుదతి యొకతె
యెంచి పకపక యిహీహీ యం•టుంచు న . 115

క. తనమదిరాకలశంబులు, గొన నీ కేమోజ నుచుఁ • గొమ్మ యొకతె యా
మున నొక చెలికుచకలశము, లనివారణఁ బట్టి లాగు•లాడుచు నుండెన్. 116

సీ. కుమ్మరిసారెలా•గున నేల దిరఁ, దిరిగె నంచును ద్రేలు • ద్రిప్పె నొకతె
వలరాచబావ క•న్నులు మూ గిలిగింత, లిడియె నంచును బొబ్బ•లిడియె నొకతె
చోరుఁడై కోరలోఁ•జొచ్చి యాసవ మెత్తు, కొని చనె విధుఁ డంచుఁ•గుందెనొకతె
వలిగాలిపయ్యెద • దొలఁగించి కులుకుగు, బ్బలు నొక్కె ననిరి త్త•యులికె నొకతె

తే. రిక్క చాలిమ్మంటి నంటి యం•మ క్క దన్ను
వెక్కిరించె నటంచు నా • మో క్క మిగులఁ
జొక్కి విక్కుచు దిక్కులు • నిక్కి చూచి
వెక్కసంబుగ నపు డొర్తు • వెక్కిరించె. 117

క. అల్లదె జాబిలి దన , క డు మని మ్రొక్కి నన్నుఁ • గన్గిలి ఫైడి నో
చెల్ల కసుంగొను మని యొక, ప వకర వలుక నొర్తు • పకపక నవ్వెన్. 118

చ. వెడవిలుకాఁడ పోఁకముడి • విప్పకు గుబ్బలు ముట్టు రాకు క్రొ

ముమ్మడి సడలింపఁ బోకు జిగిమోవియు నానకు మే లయారె రే
యొడయఁడు చూచునుండ నిది ◆ యోజయె నీ కని నిర్వరింపఁగాఁ
దొడఁగె నొకర్తు మైమఱచి ◆ తూరెకు మద్యమదంబు పెంపునన్. 119

తే. అపుడు నాశ్యామసాంద్రచం◆ద్రాతపంబు, హాళిఁ బొడగాంచి చాల వి◆రాళిమించి
నింగిఁ బొంగి కరంబు వెలుంగుచున్న, నీరజారాతి నిట్లు నిం◆దింపఁ దొడఁగె. 120

క. రాజీవలాంఛనుఁడ వగు, రాజవు నీ విట్లు క్రోధ◆రసహితుఁడ వై
రాజీవరిపుఁడ వంచున్, రాజీవాక్షులఁ గలంప ◆ రాకు శశాంకా. 121

సీ. క్షీరవారాశికి ◆ గారాపుకొమరుండ, వాదిలక్ష్మికిఁ బ్రియ◆సోదరుఁడవు
మురదానవారికి ◆ ముద్దుమఱఁదివి, హరున కుదగ్రచూ◆డాగ్రమణివి
దక్షప్రజాధినే◆తకుఁ గూర్మియల్లుఁడ, వక్షాంతబుధజనా◆హ్లాదకరుఁడ
వసమబాణునకు నె◆య్యఁపు మేనమామవు, జగముచుట్టమునకు ◆ సంగడీఁడ

తే. విట్టినీ వయ్యయో నయ ◆ మింత లేక, సారెసారెకు నజ్జాల◆చందమునను
సుందరులమీఁద వేఁడిమి ◆ చూపఁ దగునె, గురుజనాత్యంతనుతిపాత్ర ◆ కుముదమిత్ర.

క. శ్యామావధూప్రియుండవు, శ్యామలపక్షంబు నీకు ◆ నైఁప దటంచున్
శ్యామల నేఁచకు మే సు, శ్యామఁ జుమీ తుహినధామ ◆ జగదభిరామా. 123

సీ. కువలయప్రియుఁ డని ◆ కొనియాడుటకుఁ జాలఁ, జక్రాహితత్వంబు ◆ సలుపకున్న
బుధవత్సలుం డని ◆ పొగడుట కెంతేని, గురువిరోధంబునఁ ◆ గొఱలకున్న
గోత్రాభ్యుదయుఁ డను◆కొనుటకు నాత్మస, త్సంతతి నడఁగింప◆ దలఁపకున్న
మనుమార్గవర్తి యం◆చు నుతించుటకు రాజ, కాంతావలుల బిట్టు ◆ కలఁచకున్న

తే. రాజశబ్దంబు నీకు సా◆ర్థముగఁ జెల్లుఁ, గాక యూరకె లోకాప◆కారి వగుచు
నెఱయు నీరాజశబ్దంబు ◆ నేతిబీర, కాయచందంబు గాదె ప్రా◆లేయకిరణ. 124

క. వీచి తమింజక్రావళి, నేఁచెదు తెరువరులు సతులు ◆ నిల నడ లొందన్
హా చంద్ర యేమి చెప్ప ని, శాచరకృత్యములు నీకు ◆ సహజములు గదా. 125

చ. గురువరవర్ణినీమణిని ◆ గూడినద్రోహి వటం చెఱింగియున్
బరువడి లింగధారి వని ◆ భావమునం దలపోసి యేమొ ని
రిశుఁడు నె ఁ బెట్టుకొనెఁ ◆ గీడు దలంపక చంద్ర యెట్టిదు
శ్చరితుల నైఁ బ్రోచుఁ గద ◆ శంభుఁ డహా తనుఁ గొల్చువారలన్. 126

సీ. బానలంబుతో ◆ జడధిలోన మెలంగి, కాలకూటంబుతోఁ ◆ బైలు వెడలి
కంటిమొకిమీ◆నసికలోన నెలకొ యుదయాద్రిదవశిఖి ◆ నొరసి వెలికి

రాహుదంష్ట్రాంకురో • గ్రవిషాగ్నిఁ బెనఁగొని, ప్రతిమాసమును జండ • భానుఁ బొదివి
యక్షోగ్రపతాపము • హాతాపమునఁ గ్రాఁగి, మునితపోవహ్నిచే • మును జనించి
తే. నట్టినీ వెవ్వరికి నైన • నహహ మహిని, జల్లనై యుందు వనుటెల్లఁ • గల్ల గాదె
యజ్ఞు లెఱుఁగక శీతాంశుఁ • డండ్రు గాని, గురువధూటీమనోహారి • సరసిజారి.
సీ. అర్జునాశుగలీల • నలరుట కజ్జచ, క్రములఁ జేఁబట్టుట • గాంచినావొ
శ్రీవత్సలాంఛన • సి వహించుస, త్సంతతిఁ బ్రభవింపఁ • జాలినావొ
విధుసమాహ్వాయము వా • విరిఁ బూనుటకు నేవు, చెడిపోవఁ గుజనుల • నడఁచినావొ
విష్ణుపదారూఢి • వెలయుట కేడ్తెఱ, మధుమదోన్మాదంబు • మాన్చినావొ
తే. కువలయోద్ధారకాభిఖ్యఁ • గొఱలుటకును, గరుణ మీఱ వియోగులఁ • గాచినావొ
హస్తిమశకాంతరము గాఁగ • హరికినీవు, జోక యగుదువె మది జనిం • చుటనె చంద్ర.
క. హరునితల మట్టితివి గురు, తరుణిం బట్టితివి నీవు • దైవము గురుఁడుం
బరికింప నాస్తి యగుచో, విరిఁబోఁడుల నేఁచు టెంత • వింత శశాంకా. 129
తే. జనులు శ్రీతోడఁ బుట్టితి • వనుచు నిన్ను, నెన్నుదురు గానియామర్మ • మెఱుఁగలేరు
కాలకూటంబుతోడ నా • భీలలీలఁ, బుట్టినాఁడవు గద నీవు • భువి మృగాంక. 130
సీ. చెలియలియింటిబ • ల్సిరి యెల్ల హరియించి, తండ్రికి భంగంబు • తగులుపఱచి
సత్సంతతులఁ బ్రకా • శం బంతయు నడంచి, కడు సద్దణుని గ్రిందు • పడఁగఁజేసి
తమ్ములకార్తి దం • ట్టమ్ముగ నొడఁగూర్చి, వదినెబిడ్డనితోడ • వాదు పూని
యేపు మీఱ మఱంది • హృదయంబు భేదించి, గురునిసంసారంబు • గూలఁ ద్రోసి
తే. కుజనులను ంపు సేయుచుఁ • గొఱఁతలేక, తమినివిహరించుదుష్టవ • ర్తనుఁడ వీవు
తెరువరులచె ు నీకుఁ జు • ట్టరికమింక, నెవ్విధంబున సమకూఱు • హిమమయూఖ.
తే. గురునిసతిఁ గొని రమయింటి • సిరి హరించి
చెలఁగి విషబిందుబృందముల్ • చిలుకుచుండు
నాతతాయివి నీకుఁ దొ • య్యాలులమీఁద
నగ్గి చల్లుట యరుదె నీ • హారకిరణ. 132
తే. సతుల నేఁచకు నీసౌరు • సన్నముగను, గదిసి నినుఁ బట్టికొని పెద్ద • గాము ద్రింగ
నీనిలువు నీరుగాను నీ • మేను పెక్కు, తునియలుగ దొండి నీమేను • నెనయఁ జంద్ర.
తే. అనుచు సురనారి సరసీరు • హారి దూఱి, కేరి తనుఁజేరి పూవుల • కోరు లేయు
నించువిల్కానిఁ దద్బలో • పేతముగఁ గు, రించి యి ని మిగుల నిం • దించి పలికె.
క. వల తేఁడ కడిఁదిసిరి గల, బలుదొరకొమరుఁడ నటంచు • భామాత్మణులం

గలఁచకు నీపని యీశుఁడు, చలపట్టి యొకింతలోనె • చక్కంజేయున్. 135

సీ. అచలకార్ముకము నా• రాయణాస్త్రంబును, బగడతాలుపునారి • పుడమి తేరు
ప్రాఁబల్కు తేజీలు • ప్రమథబలంబును, వెలుఁగొంద నలరు బం• ట్వేల్పు మీఁదఁ
జెఱకువిల్లును విరి• చిలుకను జమిలిము, క్కాలినారియు వలి• గాడ్పు తేరు
చిలుకతత్తడియుఁ గో• యిలమూఁకయును ప్రాలఁ, జలమునమార్కొని• గెలుపు గొన్న

తే. జగమగండపు నీ విల్లు • తగవు మాలి, భీరువులమీఁదఁ బోదరు శే • సెద్దతనము
వలదు లెస్సగ మదిలోనఁ • దలఁచుకొనుము, నిరుపమాభంగశృంగార• హారికుమార.

క. జగములకుఁ దల్లి దండ్రియు, నగుసిరికి న్హరికిఁ బుట్టి• నట్టిదొగవు నీ
కగునే తోఁబుట్టువు లని, తగ వెన్నక సతుల నేపఁ • దతసుమచాపా. 137

సీ. వసుమతీజనుల సు• వర్ణకలాపము, ల్హరియించుతులువ నీ• వరసచివుఁడు
గురుతల్పగమనుఁ డై • సరవిఁ జక్రద్వేష, మూనుఖలుండు నీ• మేనమామ
మాన కెల్లప్పుడు • మధుపానమదమునఁ, బొదలుదుగ్మ్రదులు నీ• మొదలిబంట్లు
జగము లెఱుంగ హా• చ్చరికఁ బైకొని బ్రహ్మ, ఘాత యొనర్చుటం• క్కరివి నీవు

తే. జా వైరస్యరతుఁడు నీ• సంగడీఁడు, భళి మహాఘోరదురితాన్వి• తులరు వీరు
విరహిణుల నే[illegible]టిది యెంత• వింత తలఁప, వంచితాశేషగీర్వాణ• పంచబాణ. 138

తే. అకట భవదంబ లాగ్బ్ర• హంబు సిరి హ
రించు తెక్కలి శశి నాద• రింపఁ బోకు
మదన మును "సర్వనాశాయ • మాతుల" యని
చిందు రాణింప స్మృతులు వ• చింప వినవె. 139

(సీ.) విషయులిప్తంబులై • వెలయునారాచంబు, లూఁగక మొఱయుచు • నుండు నారి
యిలఁబడి నూరాల్గు • మెలచునప్రపువిల్లు, పెల్లార్చి పొదలెడు• నల్లమూఁక
నీ లోజాడేలు • నెమకెడు టెక్కెంబు, కడు నగ్గి చాయుల • నడరు సురియ
యడవిఁ గాచుక యుండు • గడుసరి సంగాతి, యీలవెట్టిన సొద్ద • ప్రాలు సచివుఁ

తే. డొరుల కేరికిఁ గనఁబడ• కుండు గూఁపు
దనరఁ బాం[illegible]లచిత్తవి• త్తములు దోఁచు
తస్కరుఁడవు ముగుదల• దఱుము టుచిదె
కుశితామర్త నగచాప కుసుమచాపా. 140

(సీ.) [illegible]బు[illegible]కుఁడ వై• యవతరించుటయును, శివునిచేఁ బన్నంబు • జెందుటయును
విషమకాండప్రాప్తి • విహరించుటయును ఘన, కాలరూపంబునఁ • గ్రాలుటయును,

వజితపరాక్రాంత•వాహుఁడ వగుటను, భయదాతనూద్వృత్తిఁ • బరఁగుటయును
బ్రజలమారకుఁడ వై • బాధించుటయు సదా, ఖండధర్మనిరూఢి • నుండుటయును
తే. దలఁచి చూచిన నీకును • ధర్మరాజు, నకును భేదం బిఁ కెద్ది యొ•న్నఁడు వియోగి
జనుల గారింపఁ బోవఁ డా•ఘనతరుండు, చంచలాక్షీమనోహారి • శంబరారి. 141

సీ. శిరమున నిద్దంపుఁ•జిన్నిక్రొన్నెల గాదు, పాలుపారు కేదంగి•పువ్వు గాని
గళమున నాభీల•కాలకూటము గాదు, శ్రీమించుమృగమద•రేఖ గాని
తనువున భూతిగం•ధవిలేపనము గాదు, మలయుచందనక •మంబు గాని
వీఁపున గాటంపు•వెడదకెంజెడ గాదు, డంబారువేణీభ• ంబు గాని
తే. రహి నురమ్మున భుజగహా•రములు గావు
మల్లికానూనపుష్పదా•మములు గాని
యకట మకరాంక శంకరుఁ • డనెడుశంకఁ
జెలఁగి నామీఁద నిటు దాడి • సేయ వలదు. 142

వ. అని మఱియుం గోపావేశంబున. 143

సీ. నెఱి మించి నీవిల్లు • విఱిగి ధూళి నడంగ, మలయక నీరూపు • మాసిపోను
బడిబడి నీబలం • బడవిపాలై చన, నే నైన నీ టెక్కె • మేటిఁ గలయఁ
గొమ్మలఁ బొదవు నీ•యమ్ము దుమ్మై పోవఁ, దూలి నీయరదంబు • మూలవట్టఁ
గదిసి నీచెలికాని • గాము పట్టుక మ్రింగ, నిలఁ బాసి నీగుఱ్ఱ • మెగసి పోవ
తే. నకట దర్పక ఘోరద•ర్పాతిరేక, మెనయఁ బని పూని విరహిణీ•జనవధంబు
సేయు చుండెదు నీ కిది • చేటు సుము, పెల్లు పడి యింక నాముంద•ద్రదు వలదు.
తే. అని మనోభవు నాడి య•య్యాలరుఁడి, వేఁడి మిఱుంగఁ బయిపయి • వీచుచున్న
మలయధరణీధరాలయ•మంద గంధ, వహుని నిందింపఁ దొడఁగె భా•వమునఁ గినిసి.
క. ఇల మరుదాఖ్యుఁడవు మహా, బలుఁడవు శూరుఁడవు నీవుఁ • బౌరుషమే చలం
బెలయఁగ నబలలఁ గలఁచుట, మలయమహీధరసమీర • మందవిహారా. 146
తే. విషధరము నిన్నుఁ గబళించి • విడువ దాని, జెనఁకి సాధింప నేమియుఁ • జేతఁగాక
విషధరాభిఖ్య గలమేఘ•విసరములను, దర మెదవు శూరుఁడవె నీవు • ధర సమీర.

సీ. మున్ను మహాబిలం•బున సముద్భవ మొంది, శైలాగ్రమున నుండి • బైలు వెడలి
ఘనవనాంతరముల • ననయంబు మెలఁగుచు, నమితనికుంజగు•ల్మములఁ దూఱి
జంతుకోటికిఁ బ్రభం•జనలీలఁ జూపుచు, విస్ఫుటమృగచర•వృత్తి నలరి
పాంథులగుండెయ • ల్పగులంగ నడఁచుచు, వితతమహాబలో•ద్ధతి నెసంగి

తే. చెలఁగి విహరించుఁగ నాఁ బెంపు గలిగి నీవు, దాడి మెఱయంగ భీరులఁ • దఱుము టరుదె
యజ్జు లెల్ల జగత్ప్రా ణుఁ • డింద్రుఁడు గాని, కామినీమారణోత్సాహ•గంధవాహ. 148

ఉ. మానక మానినీమణుల • మాటికి నేఁచెదు నాలిగాడ్వ వై
శ్వానరుఁ గూడి నీ బ్రదుకు • బైలుగ నేల చరించె దిట్లు నీ
మేను దునింగి పోవ నెతి • మీా లెదుఁనీమురి మూల ముట్ట నీ
పూనిక బు గాను నిను • బొంపఱఁ బాము మెసంగ నక్కటా! 149

వ. అని యనిలుం బలికి. 150

సీ. ఇలమీాఁద నిల్వక • యెగసి పోయెద వేమె, కీరమా నిన్ను సం•కెలల వేయ
నెపుడు చూచినఁ గన్ను • లెఱ్ఱఁ జేసెద వేమె, కోయిలా నీయిల్లు • గూలిపోను
గేకలు వెట్టుచుఁ • గేరి యాడెద వేమె, బర్హి నీముకి చెట్ల•పాలుగాను
గొమ్మలఁ గదపుచుఁ • గోరి మోసెద వేమె, తుమ్మెదా నీత్రుళ్లు • తుప్పలెక్క
తే. ఘనులఁ గన నోడి కడలకుఁ • జనియె దేమె
యంచ నిను శ్వేతరుగ్భార • మలమికొన న
టించుఁ బలుచందముల శపి•యించి పలికి
చంచలేక్షణ కడుం సంచ•లించుటయును. 151

క. ఆళీజను లపు డింతికి, హాళిని శిశిరోపచార • మలరించి రొగిన్
నాళీకనాళకిసలము, ధూళీపాళీసితాభ్ర•ధూళిచ్ఛటలన్. 152

సీ. శైలస్తని యొకర్తు • చందనగంధంబు, రంభోరు వొకతె క•ర్పూరజంబు
హిమకరానన యొకర్తు • హిమజలపూరంబు, లతకూన యొకతె ప•ల్లవచయంబు
వరవర్ణి యొకర్తు • సగసకాశ్మీరంబు, ఘనవేణి యొకతె ము•క్తాసరములు
ప్రసవగంధి యొకర్తు • మస్పృణమరందంబు, జలజాక్షి యొకతె కిం•జల్కధూళి
తే. కలితశ్బం గసరసి యొ•క్కతె మృణాళ, నాళశైవాలవల్లరీ•జాలకములు
గూర్చి యచ్చాన మైతాప • మార్చుకొఱకు, సలిపి రెంతయు శిశిరోప•చారవిధులు.

సీ. బంగరుగిండ్లపైఁ • బటిక పూసినరీతి, గబ్బిగుబ్బల మంచి•గంద మలఁది
యిందీవరములపై • హిమజలంబులు నించు, దారిఁ గన్దోయిఁ బ•న్నీరు చిలికి
యబ్జరాగములపై • హరినీలములు గూ , గతిఁ గేల శైవాల•లతలు పెనఁచి
రతనంపుటరఁగుపై • గంగవల్లులు దీర్చు, సరణిఁ జేరెద ముత్తె•సరులు వైచి
తే. మేటితుమె xగముల కా•మెతలు వెట్టు, కరణిఁ గుర్రు ను బుపొవడి • గలయఁ జ
తరుణరంభా ళోశీర•తాళవృంత, జాలముల వీచుచుండి రా•జలజముఖులు. 15

తే. మంచిగందంబు బూది యై • మహిని రాలె
నింక బన్నీరు చూత్కార • మెసఁగ మేన
నలరులుఁ జివుళ్లుఁ బొడిపొడి • యయ్యెఁ గమల
నాళములు వాడి వత్తలై • డీలువడియె. 155

క. అపు డందు మదనమోహిని, చపలేక్షణ కేలువట్టి • సరభసముగ నా
డిపరిక్ష చేసి ఘనవా, క్నిపుణత మెఱయంగ నొక్క • నెలఁతుక కనియెన్. 156

సీ. పూర్ణచంద్రోదయం•బునఁ బోవ దింతయు, నెడప కంతంతకు • హెచ్చుఁ గాని
వాతరాక్షసయుక్తి • వదలదు తద్దయు, మించి యంగదలఁ గుం•దించుఁ గాని
పస నెసంగువసంత•కుసుమాకరంబునఁ, బాయదు మతిమతి • ప్రబలుఁ గాని
యేపారిద్దు మదనకా•మేశ్వరంబున మాన, నేరదు గాటమై • నెఱయుఁ గాని
తే. నీలకంఠరసంబున • క్రీలి చనక, లోఁగఁ జేయు నహో యింక • లోకనాథ
రసమహాయోగమునఁ గాని • రమణిమేని, విరహతాపజ్వరం బెల్ల • విడువదమ్మ.

వ. అదియునుం గాక. 158

సీ. పొడ గానరాక పైఁ•బడుమనోభూతంబు, నుగ్రమంత్రంబుల • నుడుపవలయు
నలమెడుసోఁకు దఁ•య్యంబు నహీనక్రి,యావిధానంబుల • నడఁపవలయు
రేలెల్ల బైలఁ జ•రించుగామునకు వే, ల్పుల నెల్లఁ బ్రార్థించి • పొగడవలయు
నడవులఁ జెట్టపై • నామనిఁ జెలఁగుబ, ల్వేఁటకు ఘనుల ర•ప్పింపవలయుఁ
తే. గాక యుం ననీతను•గ్లాని మాని, మానినీమణి యెట్లు సం•మ్మదము నొందు
ననుచు వచియించి వారు దా•నును గడంగి, వెండియును జల్పనులు గా•వించుచుండె.
తే. అట్లు మతిమతి శైత్యకృ•త్యము లొనర్ప, నంతకంతకు నగ్గలం•బై మనోభ
వానలం బుప్పతిలి నహో•యంచు నులికి, యిందుముఖి నెచ్చెలులఁ జూచి•యిట్టులనియె.
సీ. వడగాడ్పులకుఁ దోడు • కడుఁ జంద్రునిప్పలు, పైని బోయకురమ్మ • పడఁతులార
వలకాఁకలకుఁ దోడు • కళపెళ నుడుకునూ, నియలు చల్లకురమ్మ • నెలఁతలార
వెన్నెలసెకకుఁ దో • డున్నసున్నం బెల్ల, మెదిచి మెత్తకురమ్మ • మెలఁతలార
విరితూపులకుఁ దోడు • వెడఁదకైదువ లెదఁ, గదియఁ జేర్పకురమ్మ•సుదతులార
తే. కటకటా నేఁడె పగదీర • నిటుల నేఁచఁ, జెల్లునె యటంచుఁ బల్కెఁ • దల్లడిలు
నలుఁ బన్నీరు మంచిగం•దంబుఁ దలిరు,టాకులును జూచి మదినోడి•యలరుఁబోఁ .
తే. పులుల భూతంబులను బెద్ద•చిలువగములఁ
దెచ్చి దరి నిల్పి బెదరింపఁ • జొచ్చినారి

దేమి చెలులార యంచు బి • ట్టెన్నుచుండు
శిఖిపికమృణాళములఁ జూచి • చిగురుఁబోఁడి. 162

వ. అని మఱియును. 163

సీ. కనకాభిషేకంబు • గావించి గద్దఱి, తేఁటికూటువులఁ బ్రా • ర్థించరమ్మ
సాంకవగంధమం • చల్లీల నర్పించి, కీరరాజముల న • ర్గింపరమ్మ
ఘనవైభవోన్నతి • నెనయించి కాదంబ, వితతులఁ బలుమఱు • వేఁడరమ్మ
ధవళాంశుకస్ఫూర్తి • దనరించి టక్కరి, జక్కవగములకు • మొక్కరమ్మ
తే. కాకయుండినఁ గొదలేని • ఢాక మెఱయ
మూఁకలుగఁ గూడి దోసఁగుల • ముంచుచుండు
నహహ చెలులార తొంటినె • య్యంబు విడక
కనికరము మీఱ నిచ్చోళ • మనుపరమ్మ. 164

వ. అని యిత్తెఱంగున మదనవేదనాభరాక్రాంత యై చింతిలునింతిం గనుంగొని కలంగి సంగడికత్తె లత్తఱి నంగభవాదుల నుద్దేశించి యిట్లనిరి. 165

క. కోమ నాము మీఱఁ బైకొని, సుమనారాచంబు లేసి • క్రుక్కింపకు క్రూ
రమనా రతిగమనా ధృతి, శమనా మదకీరగమన • శంబరదమనా. 166

క. పంచముఖమధ్య యని బా, ధించెదు హరిమధ్య యీసు • తీమణి మదనా
కొంచింపక కమలేక్షణ, యంచుఁ గలంచెదు పొలంతి • హరిణాక్షి శశీ. 167

క. పంచప్రాణంబులు నీ, వంచు న్మది నమ్మి యున్న • యన్నులమిన్నన్
వంచించి కలంచెద విది, మంచిదె భువనైకశూర • మలయసమీరా. 168

క. మాతరుణీమణి నెకసెను, భూతమవై సోఁకి యార్తిఁ • బొదవించె దహో
భూతమవో వాతమవో, నీతెఱఁ గెఱుఁగంగ రాదు • నిజముగఁ బవనా. 169

ఆ. తల్లి పాఱవైచి • తరల నన్యులపంచ, బ్రతికి కూఁతవట్టి • కొతుక కీవు
కన్ను లెఱ్ఱఁ జేసి • యన్నులఁ గని కారు, కూఁత లఱచె దేమి • కోకిలంబ. 170

క. పసినిసు వగుమామగువకు, విసికింపకు మనుచు నెంత • వేఁడినఁ బైపై
ముసరుచు మఱిమఱి మొరసెదు, భసలమ కింత యెగసిం • పా లేమిటికిన్. 171

ఆ. పరులపంచఁ జేరి • బ్రతికి పలాశవ త్తి మ్మెలంగుకోకి • లమ్మునకుఁ బో
సంగుఁ గాక యింటఁ • జక్కె ని మని, వెగటు చిలుక నీకుఁ • దగునె చిలుక.

సీ. బింబోష్ఠి యని నీవు • పెఁగ రాకు శుకంబ, సాంపగంధి యీ • పంకజాక్షి
పంకజాక్షి యటంచుఁ • బదరకు తేఁటిచం, షకజాలనాస యీ • పల్లవాంఘ్రి

పల్లవాంఘ్రి యటంచు • బాధింపకు పికంబ, రామాంగి యీబిస • ప్రచయబాహ
బిసబాహ యని రాకు • వెస నంచ జలదశిరోరుహ యీఘనహి•రోమరాజి
తే. యహిప రోమాళి యంచు డా•యకుము నెమ్మి
కార్ముకభ్రూలతిక యీచా•కారపుఁజెలి
యనుచు శుకభృంగపరభృత•హంసనీల
కంఠనికురుంబములఁ దద్ద • కనలి పలికె. 173

వ. అబ్బోటికత్తియ లత్తఱి నబ్బిత్తరిం జూచి యిట్లు లనిరి. 174

సీ. మలయునెమ్మేను పెం•న్మంట నుక్కఱి పోయె,విలుపలుతునియ లై • యిలను బడియెఁ
బస చెడి శరపరం•పరలు దుత్తుము రయ్యె, నీ టూరుటెక్కియం • బేటఁ గలసె
గడుసరిమూఁకకా•రడవులపా లయ్యెఁ, దూలుచు నరదంబు • మూలవట్టె
బలితంపువార్వంబు • బైలు వట్టి చరించెఁ, జెలికాఁడు దెసఁ జెంది • చెట్లు దూఱె
తే. నింతి యిం కెక్కడిమరుం డో•కింత యైన, నళుకు పూనక వానిపైఁ • దలఁపు మాని
మానసంబున నిపుడు మా•మాట నమ్మి, యసదృశానందలీలల • నెసఁగవమ్మ. 175

వ. అనిన నక్కుమారీమణి వారిం గని యి ట్లనియె. 176

తే. ప్రాణసఖులార నే నెంత•పాపజాతి, రాతిగుండియదాన నో • రాతిరెల్లఁ
గడిఁదివలవంతసెకలయ• లపునార్తి, నెంతఁ బడలెను కదరె య•య్యొమ్మెకాఁడు.

ఉ. కంతుదురాపతాపహతి • గ్రాఁగుచు నజ్జగవన్నెకాఁడు న
న్నెంతతుటారికత్తె యని • యెగ్గులు వల్కెనొ యెంతయుల్కెనొ
వంతలఁ బెట్టి మమ్ము నెడఁ•బాయఁగఁ జేసితి రమ్మలార మీ
పంతము దీఱె జాలి మదిఁ • బాయ దహో యిఁక నేమి సేయుదున్. 178

తే. అకట నాచెల్మికై యతఁ • డాసతోడఁ, జేరి వలరాచపనికి న • చ్చారి వేఁడు
కొనినఁ గాదని త్రోచి వం•చ్చినమహోగ్ర, పాతకం బింక నే ంక • బాపుకొందు.

తే. కన్ను లలరార నవ్వన్నె•కానిముద్దు, నెమ్మొగం బింక నెన్నఁ •నియు నొకపుడు
గనుఁగొనెదునట్టిమేటిభా•గంబు నాకుఁ, గలుగునో లేదొ కదరమ్మ • పొలఁతులార.

క. అక్కరుణానిధికౌఁగిటఁ, దక్కఁ బెనంగొననివలఁతి•తన మేల కడున్
మిక్కుటపుఠీవి యేలా, చక్కఁదనం బేల యుదుటు•జవ్వన మేలా. 181

వ. అని మఱియు సైరింపరానిదుఃఖావేశంబున. 182

తే. వ్రీడవతి యేడ్చె నెలుఁ గెత్తి•వెక్కివెక్కి, యశ్రుపూరంబుకుచగిరు•లంటి పాఱఁ
గిన్నరీపాణి పంకజాం•కితసువర్ణ, ల్లకీరావసదృశభా•స్వద్గళమున. 183

తే. అప్పు డబ్బాల నెదఁ జేర్చి యనుఁగుఁజెలులు, చీరచెఱఁగున వెడఁదకన్నీరు దుడిచి
కురులు సవరించి తళుకుఁజెక్కులు పుడుకుచు, హితవచోరూఢి మెల్లన యిట్టులనిరి.

ఉ. అమ్మకచెల్ల యిట్టు లెడ రారఁగ నేమిటి కేడ్చెదవు చొ
క్కమ్మగునెమ్మొగంబు కసుగందెఁ గదమ్మ కపోలపాళిప
త్రమ్ము లుదారబాష్పజలధారలఁ దోఁగెఁ గదమ్మ లెమ్మ మా
యమ్మ రయమ్మ నీ కిఁక సమగ్రమనోరథసిద్ధి యయ్యెడున్. 185

తే. సుదతి నిక్కంబు వినుము నీసోయగంబు, న్నులారంగఁ జూడగని చన్నకతన
సూటి దప్పక నిట్టి పోటి కెలమి, తేపు గ్రమ్మఱ నమ్మన్న తోఁడు వచ్చు.

క. వచ్చిన నతనికి నీకుం, జెచ్చెర సంగతి ఘటించుఁ జెలు వలరఁగ తే
పచ్చటి కరుగుద మూరక, విచ్చలవిడి నుండమ్మ వెడఁగుం గొమ్మా. 187

వ. అని యబాలికామాలికాలలామంబు నారీజనకదంబంబు మందసుందమధురాలాపం
బుల నూరడించుచుండె నని నారదునకు శారదావల్లభుం డెఱింగించిన నతం డతని
నవ్వలికథానిధానం బెట్టి దని యడుగుటయును. 188

మ. కలుషాంభోధినిమంగ ఘోరతరసంగ్రామాంగణాభంగ భూ
వలయోత్తుంగశతాంగ నిస్తులకృపావాసోజ్జ్వలాపాంగ దు
ష్కలుషధ్వాంతపతంగ శైలతనయాసంశోభితార్ధాంగ ని
ర్మలజూటాంతరగంగ సన్మణివిభాసద్భుజంగాంగదా. 189

తోటకము. పురదైత్యవిదారణ పుణ్యగుణా, రదజనిభాకృతి సాధుమతీ
సురరాడ్ద్రుహిణార్చిత సూరినుతా, చరణాయుధవిగ్రహ శైలగృహా. 190

తరల. సమరభీషణ సత్యభాషణ సర్పరాజవిభూషణా
ప్రమథనాయక భద్రదాయక పద్మలోచనసాయకా
విమతభంజన విశ్వరంజన వేదవేద్య నిరంజనా
సమదవారణచర్మధారణ సజ్జనావనకారణా. 191

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వరకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసకవితాసామ్రా
జ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్య
పుత్త్ర సకలసంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామ తిమ్మకవిసార్వభౌమప్రణీతం
బైన రసికజనమనోభిరామం బను శృంగారరసప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.





శ్రీరస్తు.

ఓం నమః కామేశ్వర్యై.

# రసికజనమనోభిరామము

## పంచమాశ్వాసము.



రాజితగుణసంగా

హారాయితవరభుజంగ • హారసుధారు

క్తారాపటీరపారద

హీరాభశుభాంగ కుక్కుటేశ్వరలింగా. 1

వ. అవధరింపుము వాణీమనోహరుండు నారదున కిట్లని చెప్పం దొడంగె నట్లు సఖీజన కదంబం బూరడింప నిలింపచంపకామోద యిం పూని యాలకింపుచున్న సమయంబున. 2

చ. తడయక రెక్కలార్చి విదితంబుగఁ దోఁక విదిర్చి లీలమై
మెడ నిగుడించి సోయగపు • మేనిహొరంగు దురంగలింపఁగా
బడిబడి ముద్దుముద్దునను • పల్కులతి ఁదనం బెలర్ప న
ప్పడఁతులమిన్నఁ జూచి యొక • పంజర రవతంస మిట్లనున్. 3

ఉ. ఇంతిరో యింత వింతవగ • పేటికి నేఁటికిఁ జూడు ధారుణీ
కాంతుఁడు సంతసం బడరఁ • గ్రన్నన నన్నవింటిదంటచే
వంతఁ గలంగి బెంగ గొని • వాలెము వాలిమి దూలి ఊపు నీ
చెంతకు వచ్చి హెచ్చుతమిఁ • జేకొను మా కొడఁగూడు వేడుకల్. 4

క. అమ్మా నీసోయగ మపు, డమ్మానిసి తోఁడు చూచి • యరు దంద్రెఁ గదా
యమ్మారుని భెడిదపుఁబూ, టమ్ముతనిమదిఁ గలంచి • యదలించుఁ జుమీ. 5

తే. గాలి దూలి దూలి • క్రాలి సోలి విరాలిఁ, దేలి వ్రాలి యోలి • బాళి మాలి
మేలి తాలి మెల్ల • క్రీలి కలంగాదు, బేల యింతవంత • యేల నీకు. 6

సీ. మురువుక రామనామమును జపియించుము, వలుదగుబ్బలసొంక • వం భలండు

సారెకు రాహుగ్రహారాధన మొనర్పు, తలఁపుము నీలకంధరుని మదిని
దురమున సంపెంగవిరిసరు ల్నించుము, పొలుపాక నాగేంద్రుఁబూజ సలుపు
పర్జన్యునకుఁ బెనుపండువు సేయుము, శరదాగమారంభ మరయుచుండు
తే. మబల పికకీరహిమకరానంగభృంగ, పవనచక్రాంగచంద్రికాప్రముఖదుష్ట
వితతి నీమీఁద నేమియు విగ్రహించి, పెంపు రాణింప వెతలఁ గాంతింపకుండు.
చ. తలిరుజిరావజీరుబలుదాడికి నోడి కడంక డక్కి పే
రలమటఁ జిక్కి పొక్కెద వహో నవహాటకదేహ నీకు నేఁ
గలుగఁగ నింతవంతఁ బడఁ గారణ మే మిఁక లెమ్ము నెమ్మదిం
గలఁగక పంపువెట్టు మిదె క్రన్నన నన్నరనాథుఁ దెచ్చెదన్. 8
క. అని యనుఁగుఁజిలుక వలికిన, మనమున నొకకొంతవంత మాని వధూటీ
జనచూడామణి వేడుక, లెనయఁగఁ దిలకించి దాని కిట్లని పలికెన్. 9
తే. చక్కెరలు నుక్కెరలు గ్రుక్కి మిక్కుటంపు
మక్కువలఁ జొక్కి చక్కని నెక్కుగతుల
నెక్కొనఁగఁ బ్రోది యిడుట కోపక్కి మిన్న
యక్కఱలు దీర్చి యిపుడు నన్నాదుకొనుము. 10
క. మకరాంకునకు న్రతికిని, బ్రకటంబుగ నలఁతిముద్దుపలుకులచేఁ గౌ
తుక మొసఁగువలఁతివఁట యిదె, శుకమా నీప్రౌఢి నేఁడు చూచెదము గదా. 11
ఉ. మారుని గేరుచారుసుకుమారుని నామహిభృత్కుమారునిన్
గూరిమి మీఱ నీ విటకు గొబ్బునఁ దోడ్కొని తెచ్చి హెచ్చునీ
ఘోరమనోభవవ్యథలఁ గుంది మదిం దిగు లొందుదాని నో
కీరమ నేఁడు నన్ను బ్రతికింపఁ గదే మధురస్వగీరమా. 12
తే. మంతనంబున్న నావలవంత తెలియఁగ, విన్నపము సేయు మమ్మగమిన్న తోడ
నింపు సొంపులు నింపునిద్దంపుముద్దుఁ, గలికిపలుకులఁ దేనియ ల్చిలుకఁ జిలుక. 13
సీ. ఆరాజదర్శనం బబ్బక యుండిన, నయనోత్పలంబు లేక్రియఁ జెలంగు
నాయినురుచిరకరాలంబనము లేక, చేతోంబుజాత మేరీతి నలరు
నాఘనునిబిడదయారస మొదవక, గాఢతాపాగ్ని యేకరణి నడఁగు
నామహేంద్రమహాకటాక్షంబు నెఱయక, సంభోగసుఖ మెట్లు సంభవించు
తే. నహహ విహగకులోత్తమ యట్టు లగుట, జాగు సేయక వేవేగఁ జని యశేష
భువనమోహనుఁ డైనయయ్యవనినాథుఁ, గడఁకఁ గొని తెచ్చి సన్మార్గగతినిముసుము.

ఆ. అనుడుఁ గీరరాజ • మట్లు చేసెదనమ్మ, చెలులఁ గూడి నీవు • వలను మీఱ
నెలమి నాఁడుకొనుచు • నే వచ్చునందాఁక, మనికి వదల కుండు • మనుచుఁ దెలిపి.

తే. కొమ్మ నీమేని దొకమంచి•సొము ఁదిగిచి,యానవాలుగ మెడఁ గట్టు • మనిన నలరి
వనజలోచన గొబ్బునఁ • దనపసిం , బన్నసర మానవా లిచ్చి • పనుచుటయును.

చ. వెర విరవార నజ్జలద•వేణిని వీడ్కొని వేడ్క మీఱ నం
బరసరణి న్వడిం బఱచి • పక్షివతంసము కాంచె నొక్కచోఁ
దెరువున రాజకీరముఖ•దివ్యపతంగమనోనుకూలభా
స్వరఫలజాలముక్ భువన•సారవిశాలరసాలసాలమున్. 17

తే. కాంచి మెల్లన యయ్యనో•కహముమీఁద
వ్రాలి యాక్రిందఁ బటకుటీ•రంబు చూచి
యిదియె కాఁబోలు నృపుఁ డున్న•యిర వటంచు
నాత్మ నూహించుచున్న య•య్యదనునందు. 18

క. వసుధాసుధాశనప్రభుఁ, డసమశరామేయసాయ•కాకుంచితహృ
ద్బిసరుహుఁ డై పస చెడి దొసఁ, గసఁగఁ గృశోదరిఁ దలంచి • యి ట్లని పలికెన్.

ఉ. హా కలహంసయాన విర•హానలవేదన కోర్వఁ జాల న
య్యో కలకంఠకంఠి చల • మూనక నన్ను సముద్ధరించు మే
లే కమలాయతాక్షి దయ • లేక కలంచెద విట్లు వేగ రా
వే కనకోపమాంగి నిను • వేఁడెద బిగ్గఁ గవుంగిలించవే. 20

క. లలనా మరువిరిబరిగో, లల నా డెందంబు గడుఁ గ•లంగెడు నివ్వే
ళల నాదుకొని కృపాలీ, లల నామోదం బొసంగి • లలిఁ బ్రోవఁ గదే. 21

మ. తళుకుంబంగరుబొమ్మచందమున నం•దం బారఁ గన్పట్టి యా
సలు పుట్టించి కరంచి వెండియును హా • జాలంబు రెట్టింప న
య్య లరుంగైదువుజోదు వేదనను న • న్నర్పించి య ట్లేగితే
బల న్నీలశిలావినీలచికురా•బాలా జగన్మోహినీ. 22

వ. అని మఱియు ని ... నియె. 23

ఉ. హా గ్గుగనిచ్చ ఁట కిపు • డేటికి వచ్చితి వచ్చి యెచ్చుగా
నిచ్చట నచ్చకోరదృశ • నేటికిఁ జూచితిఁ జూచి యూరకే
క్రచ్చఱఁ జెచ్చెరం జనక • కామిని నేటికిఁ గోరితిం గటా
ముచ్చట దీరఁ బైకొనక • ముద్దియ నేటి ఁ బోవ చ్చితిన్. 24

క. నాన మదిఁ బొదల సంగడి, చానలతోఁ గలసి మెలసి • చను నెడ నయయో
పూని కవుంగిటఁ బెనచక, మానినిఁ బో నిడితి మంద • మానసుఁ డైతిన్. 25

సీ. గబ్బిగుబ్బలు చూచి • యుబ్బుచుండితిఁ గాని, నిబ్బరంబుగఁ జెంత • నిలువ నైతి
వాలుఁగన్నులు చూచి • సోలు చుండితిఁ గాని, యల్లిబిల్లిగ మాట • లాడ నైతి
వెడఁద క్రొమ్ముడి చూచి • కడిఁదిఁ జెందితిఁ గాని, తివిరి నెమ్మదికోర్కె • దెలుప నైతి
మెఱుఁగుఁజెక్కులు చూచి • తెఱఁగు దప్పితిఁ గాని, కొసరితద్దయు వేఁడు • కొనఁగ నైతి
తే. సహహా పని మించె నబల యి • ట్లుఱ దలంచె, మరుఁడు పగ గాంచె వేమఱు • మదిఁ గలంచె
నెడరు లాదవించె విరిముల్కు • లెదను నించె, శివశివా యింక నే నేమి • సేయువాఁడ.

సీ. శైవాలధమ్మిల్ల • చక్రవాక స్తని, కలహంస గామిని • పులినజఘన
సారసవదన డిం • రాభ దరహాస, యావర్తనాభి క • ల్హారపాణి
మధుకరరోమాళి • మకరజంఘాలత, కచ్ఛపచరణాగ్ర • కంబుకంఠి
వీచికావళి మీన • లోచన కింజల్క, జాల రదన మృ • ణాలబాహ
తే. యగుచు సొగ సూనుదివిజక • న్యావిలాస, సరసి నోలాడ కింక దు • స్తరత రాబ్జ
శరశరాఘాతశిఖిశిఖా • జాతజాత, యాతనాభీతి యల్లఁ జ • ల్లారఁ గలదె. 27

మ. సవనాదిక్రియల న్సుధాంధులను మెచ్చం జేసి ధన్యాత్ము లై
నవిశేషజ్ఞుల కబ్బుఁ గాక యకటా • నాకేటికిం గల్గుని
వనాతీతవిలాసవిభ్రమకళా • భూరిప్రభాంచన్మరు
ద్ధ శాక్షీమధురాధరాధరసుధా • ధారాసరిగోరణుల్. 28

ఉ. భూమిని భామినీమణుల • భూరివిలాసరసై మాన్యలక్ష్
వేమఱుఁ బ్రేమ ముల్లమున • విస్తరిలం గనుఁగొందు మే కదా
కాముని మోహనాంబకము • కైవడిఁ దద్దయు నుద్ది మీఱు న
క్కామినిరూపవైభవము • న్నులఁ గట్టినయట్లు యుండెడిన్. 29

క. తమిఁ గన్నులార నాఱని, ప్రమదంబున నింక నొక్క • పరి గన్గొను భా
గ్యము దొరకునొక్కొ నా కా, సమదద్విరదేంద్రకుంభ • సమకుచకుంభన్. 30

ఆ. అని తలంచుచున్న • యా రాచతలమిన్న, పలుకు లాలకించి • యొలమిఁ గాంచి
యిది యవేళ యంచు మదిలోన నూహించి, నెమ్మి నొక్కచెంత • కొమ్మ కనియె.

క. కులుకుచుఁ జక్కెరతేయ, చిలికెడు నిద్దంపుముద్దు • జిలిబిలిపలుకుల్
వొలయఁగఁ జతురత వెలయఁగఁ, జిలుకానాడెంపు రాచ • సింగముఁ బలికెన్. 32

చ. టకట రాజచంద్ర యిది • న మొ నిర్జరకన్యకామణిః

దటుకున ఘోరమారనిశాతప్రదరంబులపాలు చేసి యి
చ్చటికి కిటు చేరి నీవును విశంకటతాపభరాలసుండ వై
యటమటఁ జెందెదే లేల పదమా మదమార నెలంతచెంతకున్. 33

తే. అధిప నీమోహనాకృతి • యద్భుతముగఁ, గాంచినప్పటినుండియుఁ • బంచశరని
శాతచూతశరాఘాత•యాతనావి, ధూతచేతోంబుజాత యై • నాతి ప్రుక్కె. 34

సీ. భృంగ మంగనకు బాల్సింగ మై పొడకట్టె, గాలి బాలిక కుగ్ర•లి యయెఁ
బిక ము చేడియకుఁ గాఠ్మక ముపొల్కె నెసంగెఁ, జాత మింతికిఁ బెను•భూ మయ్యెఁ
బన్నీరు కన్నెకు • మున్నీరు తెలఁ గయ్యెఁ, గలువ చెల్వకు దొడ్డ•చిలువ యయ్యె
శారి నారికిఁ బెద్ద•మారి యై కనుపట్టె, హారము చెలికిఁ బ్రహార మయ్యె
తే. నేమి చెప్పుదు నీకు రా•జేంద్రచంద్ర, చంద్రవదనకు నిపుడు ని•స్తంద్రభావ
భవభవోదగ్రసంతాప•భరవికార, మంతకంతకు న లం • బగుటకతన. 35

ఉ. చెప్పెడి దేమి దేవరకుఁ • జేడియచందము పాన్పుప్రై వ్రీరు
నిప్పక లంచుఁ దద్దయుఁ జలింపుచు నూర్పులు నింపుచుం ని
న్గుప్పునఁ దోడితె మ్మనుచుఁ • గూరిమి నంపిన వచ్చితిం గటా
యిప్పు డిఁ కేమి యయ్యెనో మృ•గేక్షణ మారవికారవేదనన్. 36

ఉ. పూనదు మేన మానికపు•భూషణము ల్చెలు లెన్ని చెప్పినన్
మానదు నీవిలాసగరి•మంబు గణింపక యొద్దిబోటులం
గాన దనూనబాష్పకలి•కాకృ లోచన యై నిజమ్ము సు
మ్మానవిల్తునాన నలి•నానన పయిఁ గూరి పెంపునన్. 37

తే. కమ్మవిల్కానిచేతిపూఁ•గొమ్మముద్దు, గుమ్మ తనంపుబసిఁడికీ•ల్బొమ్మవలపు
గ్రమ్మ ని మ్మగుకపుఁం •దిమ్మ సుమ, కొమ్మ నెమ్మె దలిర్పఁ గై •కొమ్మ రమ్మ. 38

ఉ. అంగము మేల్కడాని సఖ•రాంకు ముల్ తె క్రొత్తముత్తెముల్ •
ముంగురు లింద్రనీలములు • మోవి చొకారపుఁదని కెం శే
వం గనుపట్టుపల్వరుస • వజ్రపుఠా ల్లనుమానికం బకీ
ల్బంగరుబొమ్మ సుమ్ము నర•పాలక బాల కండింది మీటఁగన్. 39

క. అండజయానచనుంగవ, యండ న్వసియించుభాగ్య • మబ్బిన సుమకో
దండుఁ డన నెంత వినుమా, కొండలతోఁ బోరవ • గువలయనాథా. 40

క. అని చిలుక వలుకుటయు న, జ్జనవరుఁ డత్తఱి చూచి • శాఖా మునం
గనుపట్టునవ్విహంగముఁ, గనుఁగొని యనిమేష సమగ్ర•కౌతూహలి యై. 41

తే. రమ్ము రాచిల్క విరహావా • రాశిలోన, మునుఁగు నా కొక తెప్ప వై • మొనసి నిలిచి
మగువ తెఱఁగెల్ల నెఱిఁగించి • మనిచితింక, నిన్నుఁ గొనియాడ నేజాడ • నేర్చువాఁడ.

క. భళిభళి శుకవికిరమణీ, పలు కిప్పుడ తర్కితోప • పన్నం బగుమే
తెలియింపుచు నెమ్మది క, గ్గల మగుకౌతూహలంబు • గలిగించెఁ గదే. 43

ఆ. అనుచుఁ జేరఁ బిలిచి • నెన రొప్ప ముంజేత, నునిచి మేను నిమిరి • మొనసి ముద్దు
గొనుచు నెమ్మనమునఁ • బెనఁచుకూరిమితోడ, నెనసి మఱియు దాని • కిట్టు లనియె.

శా. ఏమేమీ రమణీశిరోమణి భళి • యి ట్లాడి నిన్నంపెనా
నామీఁదం గలకంఠకంఠి కెదలో • నం గూర్మి వాటిల్లెనా
భామారత్నము బోటు లిప్పనికిఁ దో • డ్పాటై విడంబించిరా
నీమే ల్పల్కుఁక దాఁచ నేల చెపుమా • నీడోద్భవశ్రేష్ఠమా. 45

చ. అతితరమారఘోరవిశి • ఖాగ్ని శిఖాపరితాపభీతి న
య్యతివలమిన్న నిన్నిచటి • కంపెడిచో మఱి యేమి వల్కె నీ
మతిఁ గొతుకంగ నేల చెపు • మా జగదేకమనోహరప్రభాం
కితనిజతుండనిర్న్మిత • కింశుకమా శుకమా రయంబునన్. 46

మ. మకరాంకుం డతిసాహసుండు శశిదు • ర్మార్గప్రచారుండు త
త్పికకీరభ్రమరాహిభుక్సితగరు • ద్బృందంబు నింద్యం బహో
శుకమా మాటలు వేయు నేటికఁక నాఁ • చోఁ బ్రేమ వాటించి యా
చకితానంగకురంగశాబనయనన్ • జంద్రాననం గూర్పుమా. 47

ఉ. నిక్కము గాఁగ నాపలుకు • నెమ్మది నమ్మి దిటంబు చేసి యో
చక్కెరబంటి మేల్బిరుదు • జక్కికొలంపుజగామగండ యా
చక్కెరబొమ్మ కెంబెదవి • చక్కెరపానక మాని చొక్కుచోఁ
జక్కఁగ నీకుఁ గమ్మవలి • చక్కెర లక్కఱతో నొసంగెదన్. 48

తే. కోమలికి నీవు తద్దయుఁ • గూర్చనుఁగ
వగుట మరునకు నెఱబంటు • వగుట నిన్నుఁ
గరము ప్రార్థించుకొనియెద • ఖగకులేంద్ర
మగువతోఁ గూర్చి ననుఁ గృప • మనుపు మిపుడు. 49

తే. అనిన శు రాజ మతనిఁ • నెని నృపాల
వంత యిం తేల యిది యాన వాలు గాఁగఁ

జేడె దనబన్నసగ మంపెఁ • జూడు మనుచుఁ
జూపుటయుఁ బుచ్చుకొని తద్ద • చోద్య మంది. 50

క. బన్నసర మపుడు నరపతి, కన్నుల నద్దుకొని యెదను • గదియించుచు న
క్కన్నెలమిన్నం గాంచిన, కన్నన్ డెందమునఁ గూర్చి • సదుఁగఁ బలికెన్. 51

ఉ. సేమమె గోము మీఱురతి • చేతినిగారపుపైఁడిబొమ్మ క
య్యామనిపు ఁగొమ్మను నో • యారపువేలుపురాచకొమ్మకుం
గామునిగీముతొ ఁటవలి • ప్రపుదిమ ను ముద్దుగుమ ను
ద్దామవచోనిరూఢి మణి • దామము ప్రేమ మెలర్పఁ జెప్పుమా.

ఉ. అంబుజపత్రనేత్రహృద • యంబు తెఱంగొక యింత నీకుఁ ద
థ్యంబుగఁ గాన నయ్యెడుఁ గ • దా ప్రమదామణి దా నను న్ ప్రసూ
నాంబకకేళి నేలి యల • రారఁగఁ జేయునొ ఘోరమారదుః
ఖాంబుధిఁ ద్రోచి వైచునొ య • హో మణిహారమ వేగఁ దెల్పుమా. 53

ఉ. తాలిమి దూలి జాలి మదిఁ • దాక్కొన నక్కనకోపమాంగి నై
వ్రాలని హూర్మిఁ గ్రాంగి బలు • వాసి దొలంగి కలంగుచున్నచో
వేళ యెఱింగి నన నుప • వేళము వ ‍ తి మేలుమే లహో
నీలకచాకుచాంచల • నిద్రవిహా మ ర న్న హారమా. 54

ఉ. ఊరక కోరిక న దమ • యూరక కీరకదంబబంభరీ
శారికలుం జకోరి లు • సారెకుఁ గేరి లంఘఁ జాఁగె న
మ్మారుఁడు క్రూరుఁడై పొదవె • మచ్చిక హెచ్చఁగఁ దెచ్చి కూర్పు మా
హా రమణీయభర మయ • హారమణీ మణీశిరోమణిన్. 55

ఉ. అన్నులమిన్న ని న్నచటి • ం న నిం పెనయంగ వచ్చి యా
వన్నెలదొంతిసంతసపు • వార్త దిటంబు ఁ దెల్పి నేఁడు నా
బన్నముఁ ద్రోచి వైచి • న్నసరంబ బళా జగంబునన్
బ్రన్న సద్గుణోన్నతు • లు లిట్టివ కావె యా యన్. 56

ఉ. అ కమలాయతాక్షి నను • నక్కున నొక్కి కవుంగిలించుచోఁ
జి ‍ లఁ బెట్టి నిన్న లఁ • యుదు నంచుఁ దలంచఁ బోకు నా
య కఱఁ దీ • యాదుకొను మా మణిహా ము పేరు మీఱ న
మ క్క పరో కారవిహీ • తాతు లన్ మనే యెంతురే. 57

తే. క యురమున నెత్తావి • కలప మలఁది

విరిసరంబులు దమి నించు • వేళఁ జాల
వలలఁ జేయుచుఁ గాని నే • ల్మఱచి యేను
నిన్నుఁ జిక్కుల నిడఁ జూమీ • బన్నసరమ. 58

ఉ. సాంకవగంధసారఘుస • సారమృగీమదసారసౌరభా
లంకృత మైన వేల్పునవ • లాతలమిన్న యురంబునై నిరా
తంకగతి న్సుఖించునమి • త మ్మగుభాగ్యము నీకు నబ్బె నా
కింక మ ఱెన్నఁ డబ్బు నచి • యింపఁ గదే మణిహారరాజమా. 59

సీ. కలకంఠిజఘనభా • గం బంటి యుంటకుఁ, గాంచి యేపుణ్యంబు • గాంచినదియొ
వెలఁ జెక్కులచెంత • వ్రేలుచుండుట కేయు, పాసన చేసెనో • బవిరజోడు
కలికివాతెఱపాన • కము చవి గొనుటకు, ముక్కర యేవేల్పు • మ్రొక్కెనో నెఱ
పొలఁతి ముద్దుమొగంబుఁ • బొదవి యుండుటకుఁ జేఁ, ర్చుక్క యేవ్రతముల • సుక్కెనో కొ
తే. కంజముఖి మేటిసిబ్బెంపు • గబ్బిగుబ్బ, గుబ్బలులదండ నుండ నే • ఘోరతపము
సలిపితివొ నీవు మీభాగ్య • సరణి ధరణి, నెన్నఁ దరమా కడాని హొంబా • బన్నసరమ.

చ. పలుకులు వేయు నేల విను • పైదలిపైఁ దలకొన్నకూర్మి నేఁ
దెలుపఁగఁ జాల బాల నిటఁ • దెచ్చి రయంబున నాయురంబునన్
నిలుపుము కాక యున్న నిదె • నెమ్మది నమ్మదిరాక్షి పేరుగా
మలయుకడానిబన్నసర • మా విను నక్కునఁ జేర్చి చొక్కెదన్. 61

తే. అనుచుఁ బలవింపఁ గీర మో • యధిప యింక, నిచట జాగేల వేగ న • య్యింతి నిన్ను
క్రీడమై నున్నమనికికి • వేసు కలగ, రమ్మ చక్కఁగఁ బొసఁగుఁగ • ర్జమ్ము లెల్ల. 62

వ. అని మఱియు నిట్లనియె. 63

ఉ. అమ్మదచంచరీకరుచి • రాలకజాలక దా నొకింత డెం
దమ్మన యందునాపలుకు • నమ్మక యమ్మకరాంకకంకప
త్రమ్ములదాడి నే మగునొ • రాజకులైకలలామ జాబువా
కమ్మ లిఖించి నాయలుతఁ • గట్టుము చెచ్చెర నేగి యిచ్చెదన్. 64

వ. అనిన నతం డట్లు కాక యని లేఖ లిఖియించి యాలేఖ యాలేఖవధూవతంసమ్మునకి
మ్మని గట్టిగ మెడం గట్టిన. 65

క. దిట్టతన మెలయ నప్పుడు, చెట్టుప లల్లార్చి యెగసి • చెచ్చెర దివి న
ప్పిట్ట నెటఁ బఱచి గొనబుల, ట్టి తనమొదలి నెలవు • పట్టునఁ జేరెన్. 66

వ. అయ్యవసరంబున. 67

తే. వంతఁ గలఁగుచుఁ దెఱఁగంటి • వాలుగంటి, యల్లనృపుఁ డెత్తు నని పూని • యరిగినట్టి
చిలుక రాదయ్యెఁ దడ వేల • చేసెనొక్కొ, యనుచు గ్గాదిలిచెలికత్తి • యలను బలికె.

సీ. చెలులార ముద్దురా • చిలుక రానెల్లప్రోలి, కేరీతి నురుగతిఁ • జేరఁగలదు
చేరి యేరీతిఁ బ్రవే • శింపఁ జెల్లనిలోన, గరు మతి యేభంగిఁ • జొరఁగఁగలదు
చొచ్చి యచ్చట నిచ్చ • నిచ్చ హెచ్చగుకీవిఁ, గ్రాలు నేలిక నెట్లు • గాంచఁగలదు
కాంచి యించుక మదిఁ • గొంచ కేతెఱఁగున, నతనితోఁ దగుమాట • లాడఁగలదు

తే. మాటలాడిన విని రాజ • మన్మథుండు, కౌతుకం బార నిచటికే • కరణి వచ్చు
వచ్చుట హుళక్కి కటకటా • పచ్చవిల్తు, దాడి నింకెవ్విధంబునఁ • దాళుదాన.

ఉ. అక్కట మిక్కుటంపుఁదమి • నక్కరుణానిధి నాదుచెల్మికై
చక్కవ మీఱఁ జేరి బతి • మాలినఁ గా దని వీడ నాడి నన్
జిక్కులఁ బెట్టి యిట్టివెతఁ • జెందఁగఁ జేసితి రమ్మలార యిం
కెక్కడిమాట యాతఁ డిట • కేటికి వచ్చు నృపుల్ పరాఙ్ముఖుల్. 70

ఆ. కుసుమశరశరార్తిఁ • గుందుచుఁ జిల్కను, రాయబార మనుప • రాక మనలెఁ
బత్తు లేద రాచ • పను లేద యనుచు లోఁ, దలఁప వలదె వెడఁగుఁ • దనము గాక. 71

తే. కోరి యేప్రొద్దు సానుల • కూటములను, దవిలి కలకంఠు లెడపక • దరుల మెలఁగ
భోగినులు మట్టుకొని యుండఁ • బొదలుభూమి, భృద్వరుం డింక నీవంక • కెట్లు వచ్చు.

తే. అహహ దక్షిణనాయకుం • డగుచు జనులఁ, జాల నలయించు పెద్దగాఁ • బోలు నాతఁ
డటులఁ గాకున్న మారక • భటులచేతి, యాతనలఁ గుందఁ జేయునే • యబలలార.

వ. అని చింతించుచున్న సమయంబునం జిలుక యాకలకంఠి మ్రోల లీలం గనుపట్టిన దా
నిం గని యావన్నెలగని యిట్లనియె. 74

క. అండజసత్కులమండన, నిండానుముదంబుతోడ • నిక్కము చెప్పుమా
గుండియ లదరెడుఁ గామో, పండో నీ వేగినట్టి • పని వైళమునన్. 75

ఉ. అంగజుఁ గ్రుంగఁ జేయు నెఱ • యందపుఁ జందపు రాచమిం సె
బ్బంగిఁ గనుంగొనం బొసఁగెఁ • బాయక యామెకిమాని డ. నే
యంగున మాట లాడితి ధ • రాధిపుఁ డే మని పల్కెఁ దెల్పు నా
బంగరుముద్దుచిల్క నినుఁ • బ్రాణపదంబుగ నెంచి పెంచితిన్. 76

క. చిలుకా యారాక్రొన్నన, విలుకానిం దేక నీవు • వే వచ్చుటచే
నలుకాత ం దళుకొత్తఁగఁ, బలుకాటియలం గృశింపఁ • బాల్పడితిఁ గదే. 77

వ. అనినం బత్తు యాసరోజాక్షి నీక్షించి యిట్లనియె. 78

మానినీమణి నీయ్యా • పూని యేను
సరభసంబుగఁ జని చని • తెరవులోన
సొక్కి సహకారభూరుహం • బెక్కి దిక్కు
లరయుచున్నంతఁ జెంత నం • త్తరువుక్రింద. 79

సీ. నిదురలేవడఁ గెంపు • నెఱయుకన్గవతోడఁ, బొడిపొడి యైనమై • పూఁతతోడ
సడలినఁ దనంపు • బెడఁగుసొమ్ములతోడ, బడలి చె న్నె లిన • యొడలితోడ
సుడుగక పాదముని • ట్టూర్పుగాడ్పులతోడ, జిగి దొలంగినముద్దు • మొగముతోడఁ
జెక్కునఁ జేర్చిన • చెయిదామరలతోడ, జాలిఁ దూలెడుమాన • సంబుతోడ

తే. వ్రాలి హా భువనైకమో • హమవిలాస, భాసమానాంగి నమఁ గ పాం • పాటవమున
మనుచు మనుచు మనోజవేం • దనలఁ గనలు, చున్న నెఱవన్నె ల రాచ • మిన్నఁ గంటి.

ఉ. ఓచిగురాకుఁబోఁడి విను • మొక్కపటావసధాంతరంబునన్
నీచెలువంబె సారెకు గ • ణింపుచుఁ గంపిలుచుండి దండ నన్
జూచి మనోజువాజి యను • చుం బలవింపఁ దొడంగె నార యా
రాచకొలంపు రేదొరవి • రాలి తెఱం గిఁక నేమి చెప్పుదున్. 81

సీ. హా ప్రభా వప్రఫు • ల్లాంభోజలోచన, హా శరద్రాకాసు • ధాంశువదన
హా సమదద్విరే • ఫాలకజాలక, హా తప్తచామీక • రాభగాత్రి
హా దిశాకుంభికుం • భాంచితకుచకుంభ, హా పరిపక్వబిం • బాధరోష్ఠి
హా హీరశకలమ • నోహరరదనాళి, హా నవదర్పణో • ద త్కపోల

తే. హా ఘనిన్యాన్య గంధర • రాజకన్య, యహహా మారున టుల న • న్నప్పగించి
యొడవఁ జెందించికుంది చిం • జూడిఁ గిచని తెయ్యంచునిన్నెంచునతఁడు క్రొ • మ్మించుఁబోఁడి.

తే. ఏమి చెప్పుదు మఱియు నం • బుజాక్షి జాని
యుపిద నీచొక్కటపురూప • మొక్కచిత్ర
ఫలకమున వ్రాసి ముందఱ • నిలుపుకొని ని
తాంతమోహాతి కఱబు • దనరఁ బలికె. 83

క. ఏమే యో మేచకకచ, యేమే వామేక్షణామ • ణీ హేమఘృణీ
యేమే సోమోపమముఖి, యేమే మో మెత్తి చూడ • కిటు లెంతురఁటే. 84

క. పచ్చనిలిలుదొ వైఁ, గ్రచ్చఱ విరములుప లేసి • కాఱియు నిడుచో
మచ్చిక నన్ బ్రచుటకై, వచ్చితివా ముద్దుగుమ్మ • వలఁతివి లెమ్మా. 85

క. నానా చూడవు మదకల, యానా యానలినశరుని • యాన సుమీ న

న్నానన మెత్తి కనుంగొని, సూనాస్త్రక్రియల నెఱపు • చూపకయున్నన్. 86

క. అలుకా పలుకవు మరునిరి, చిలుకా రతిచేతిముద్దు•జిలుకా ప్రియులుకా
తలుకారుమేలిబంగరు, మొలకా వలకాఁక ముట్టు • ముల కామెఁ గదే. 87

వ. అని పలికి మఱియుం దత్తరంబున. 88

చ. చెక్కిలి ముద్దు వెట్టుకొనుఁ • జేతఁ దురంబును దువ్వ నెమ్మదిం
జొక్కి కవుంగిలించుకొనఁ • జూచుఁ జనుంగవ యంటఁ బోవు నో
చక్కెరబొమ్మ నన్మదన•సంగరలీలల నేలు మంచుఁ బె
న్మక్కువ మీఱ మ్రొక్కి బతి•మాలు వివేకము మాలి తూలుచున్. 89

సీ. కావిచక్కెరముద్దు•మోవి యానఁగఁ బోయి, సారె కూరక నోరు • చప్పరించుఁ
బెనఁగి క్రొన్ననపాను•పునకుఁ దార్పఁగఁ బోయి, తరలక యున్న పా•దములకొఱగుఁ
గడఁక మీఱఁగఁ బోఁక•ముడి వదల్పఁగఁ బోయి, గడగడ వడకించుఁ • గరయుగంబు
గబ్బిచన్గవ యొత్తి • కౌఁగిలింపఁగఁ బోయి, కళవళంబున బయ • లౌఁగిలించుఁ

తే. ప్రేమ మాటాడు మని పల్క•రించఁ బోయి, మాఱ్పలుకకున్న వెడవెడ • మాటలాడుఁ
గన్నయన్నులతరమె య•న్నన్న చిన్ని, మన్నుదొరమిన్న వలవంత•చిన్నెలెన్న.

క. కొమ్మా యనుఁ బలుకవె విరి, కొమ్మా యను నీసు నింత•కొఱకొఱ చెల్లెక్
బొమ్మా యను నునుఁజిత్తరు, బొమ్మా యను రాజమౌళి • పొదలువిరాళిన్. 91

తే. అట్టివిరహార్తిఁ గుందుచు•న్నట్టిమనుజ, వల్లభుని గాంచి నీరెఱుఁ • గెల్లఁ దెలియ
విన్నవించిన నతఁడు న•న్నెన్నరాని, కనికరము మీఱఁ జూచి యి•ట్లనుచుఁ బలికె.

ఉ. కోమలిమీఁద నాకుఁ గల•కూరిమి దేవుఁ డెఱుంగుఁ జిల్క నీ
కే మని చెప్పవాఁడ నిపు•డించుక నీవును జూచితే కదా
భామినిమోవిచక్కెరల•పానక మానక మాన నేర దీ
కామదురాపతాప మిఁక • గట్టిగ దానిఁ బరిగ్రహించెదన్. 93

వ. అని పల్కి. 94

తే. కమ్మవిల్కానిఁ దెగడున•య్యెమ్మెకాఁడు, కొమ్మ నామాట నీ వెద • నమ్మ వనుచుఁ
గమ్మలిఖియించిపంచెని•క్కమ్ము గాఁగ, నమ్మమిదె వచ్చునతఁడు నీ•యిమ్మనకును.

వ. అనిన నచ్చాన చెచ్చెర నచ్చోటి విచ్చి పుచ్చుకొని నెచ్చెలి కిచ్చిన నది యిట్లని చదువం దొడంగె. 96

సీ. । మత్సకలలోక•సీమంతినీజనా, తీతనిరంతర•ద్యోతమాన
వరరూపలావణ్య•వైభవశాలిని, యైనసుశ్యామాభి•ధానదివ్య

గంధర్వకులరాజ•కన్యాలలామకు, ఘనుఁడు ఋతుధ్వజా•వనివిభుండు
పనిచినశోభన•పత్త్రిక నీవు నా, కనుదోయి కఱ్ఱంబు • గదుర నెదురఁ
తే. గడఁకఁ బొడకట్టి యప్పుడే • జుడిఁగి పోవు,టాదిగఁ బ్రసూనవిశిఖజ్వ•రార్తిఁ జెంది
కుందుచున్నాఁడ నింక నీ•కోమలాధ, రాధరసుధారసం బిచ్చి • యాదుకొనుము.
ఉ. ఏ మని తెల్పువాఁడ నొక•యింతయు నక్కటికంబు లేక న
న్నామని తేఁడు రేదొరయు • నంచలు దేఁటులు గీరశారికల్
కాముఁడు గండుఁగోయిలలు • గాటియ పెట్టు తెఱంగు నీవు లోఁ
గామినికామినీజనశి•ఖామణి మత్తమరాళగామినీ. 99
క. అని చదివిన విని వనితా, జనరత్నము సిబ్బితియును • సంతసమును నె
మ్మనమునఁ బెనఁగొనఁ జిలుకం, గనుఁగొని యిట్లనియెఁ బ్రేమ • గడలుకొనంగన్.
శా. ధాత్రీనాథశిఖామణిం గని యథా•ం బొప్ప మత్కార్యమున్
శ్రోత్రానందము గాఁగఁ దెల్పి యత ం • జొక్కించి వేఁ క్రమ్మఱం
జిత్రప్రక్రియ నేగుదెంచి యశముం • జేకొంచు మేల్మేలహో
పత్త్రీ పత్త్రికఁ దెచ్చి నిల్పితివి నా•ప్రాణంబు లిప్పట్టునన్. 100
క. శ్రీరమణికి గీరమణికి, నీరమణీయోక్తి యుక్తి • నెఱపుచుఁ దచ్చే
తోరమణులఁ గూర్తువు నిన్, గీరమణీ నే నుతింప • నేర్తునె యింకన్. 101
వ. అని చిలుకం దిలకించి పలికి కలికి చెలికత్తియలుం దానును మనోవికాసంబున భా
సిలుచుండె నాసమయంబున. 102
తే. చక్రపరిపాలన మొనర్ప • జగముపైందుఁ, దరలి వచ్చెను నీ వింక • నరుగుమంచు
సురలు శశికంచు మేలిబం•గరపుఁగమ్మ, చు ట్టనఁగ నభ్రమున వేగు•చుక్క వొడిచె,
తే. చక్రరిపుఁ డగురాజశా•సనమువలన, నెంచి మారుండు పాంథుల • నేయఁ జాఁగఁ
గావ రావే యటంచు జ•గంబువిందుఁ, గూర్చి మొఱ చేసె ననఁగఁ గు•క్కుటము లఱచె.
సీ. అసమానవాసనా•లసమానమకా, ప్రసవమంజరులపై • ముసరి ముసరి
విమలామృతాకీర్ణ•కమలాకరోత్తుంగ, కమలానుషంగంబు • గాంచి కాంచి
మృదులాతిశోభన•చ్ఛదలసద్ఘనసార, కదళీవనంబులఁ • బొదలి పొదలి
యేలాలతాజాల•డోలాతతవిహార, లీలలఁ బలుమాఱు • సోలి సోలి
తే. యుపరిసురతక్రియాక్లిన్న•చపలలోచ, నాఘనస్తనభాగని•దాఘసలిల
బిందుసందోహవిహృతిఁ బెం•పొందిపొంది, వీచె వలినాలిచలిగాడ్పు • లేచి యపుడు
తే. అతుల గతుల నితాంతో•పరతులఁ బతుల

మతుల కామోద మొనఁగూర్చి • నుతులు గన్న
సతులనెరజాణతనపుసు• తుల కెలమిఁ
జెలఁగి తల లూఁచె నన ప•క్షులు వడఁకె. 106

తే. కలకలధ్వానములతో ఖ•గంబు లెగసి, చదలఁ జరియించెఁ దమకుల•స్వామి యైన
యరుణుఁ డుదయించుచో నెదు•రరుగ దెంచి,యతనిదర్శింపసమకట్టి•నవియొ యనఁగ.

చ. గుసగుసలాడి పల్లవుల • గొబ్బున వీడ్కొని యుత్తరీయముల్
ముసుఁగులు వెట్టి దట్టముగ • మోముల నిద్దురచొక్కు దేఱ వె
క్కసముగ దిక్కు లారయుచుఁ • గ్రంతలవెంబడిఁ దారి తారి పల్
దోసఁగు లెసంగులోఁగిళులు • దాటిరి క్రమ్మఱి జారకామినుల్. 108

సీ. కమ్మవాతెఱపాన•కమ్ములు చవి చూపి, నిద్దంపుచెక్కులు • ముద్దొసంగి
కులుకుసిబ్బెపుగబ్బి•గుబ్బ లంటఁగ నిచ్చి, దట్టంపుఁగౌఁగిలిం•తలఁ బెనంచి
తమి రేఁచి నీవిబం•ధములు విప్పఁగ నిచ్చి, జఘనసంస్పర్శనో•త్సవ మొనర్చి
బహువిధరతికళా•మహిమలఁ జొక్కించి, బిలిబిలిపాలపుఁబ•ల్కులఁ గరంచి
తే. మెల్లమెల్లనె చేతిసా • మ్మెల్ల లాగి, తెల్లవాఱినఁ దమదెస • వెల్లి బెల్లి
తల్లులను దార్చి గణికామ•తల్లు లిండ్ల, వెళ్లఁ దోలించి రత్తఱిఁ • బల్లవులను. 109

సీ. కడఁకతో నిదుర మే•ల్కాంచి దిగ్గనఁ బాన్పు, దిగి కటిస్థలిఁ గోక • బిగియఁ గట్టి
పెనగొన్నముత్తెంపుఁ•బేర్లు చిక్కుడలించి, వదలినతొడవులు • గుదురుపఱచి
విరులతావులు గ్రమ్ము•కురులు క్రొమ్ముడి దిద్ది, కులుకుఁబాలిండ్లఁ గం•చెల ఘటించి
మొకమున నెలయుకా•టుక పైఁటకొన నొత్తి, పుక్కిటివిడె మొక్క•చక్కినుమిసి
తే. యందియలు మ్రోయ మట్టియ • ల్గ్రిందు సేయ
నిదురచొక్కుల నడుగులు • గొదుకు పూన
సతులు పడకిండ్లు వెలువడి • చనుహారంగు
ప్రియులడెందంబు లపుడు త• యుఁ గరంచె. 110

ఉ. విక్కుచుఁ బోయి యాగడపు వెంపరతొత్తులయిండ్లు దాటి బల్
రొక్కము గుమ్మరించి కడఁ • ద్రొక్కుచు వేగినదాఁక రాక వాం
డ్రొక్కెడ వైచి పోవుట క•యో యని రెంటికిఁ బాసి గ్రుడ్డనీ
ల్గొక్కుచు జాతి రిక్కలకుఁ • గొత్తబొజుంగు వెడంగు లయ్యెడన్. 111

క. తూరుపు తెలతెలవాఱెఁ, దారలు హదీపములును • దమి లంజియలం
జేరినసిగ్గరిబొజుగుల్, బారులమోములును దెల్లఁ•బాఱె నొకంతన్. 112

వ. అంత. 113

మ. బిసినీకాంతవియోగసంజనితగర్భీభూతతాపజ్వరో
ల్లసదార్తిం గృశియించుచున్నయెడఁ గల్యప్రాజ్ఞనై ద్యుండు నే
ర్పెసఁగం దత్ప్రబలోపతాప ముడుపన్ హేలాగతిం దెచ్చుబ
ల్లసదిందూరపుటుండయో యనఁగ మార్తాండుండు దోఁచెన్ దివిన్. 114

సీ. చక్రరక్షణకళాచాతుర్యశాలి దా, నిసశబ్దవాచ్యుఁడై యొసఁగు టరుదె
సతతతమోగుణోచ్చాటనచణుఁడు దా, లోకబాంధవుఁడై వెలుంగు టరుదె
కమలాధికామోదకరమూర్తియుతుఁడు దా,సాకిసమాఖ్య వహించి యలరు టరుదె
విష్ణుపదాసక్తి విహరించుమేటి దాఁ, బరమహంసఖ్యాతిఁ బరఁగు టరుదె
తే. యనుచు ననచినవేద్కబుధాళు లెల్లఁ
దను నుతించుచు సముచితకృత్యములు దీర్ప
సకలజనులకు లోచనోత్సవము మీఱ
దరణి వెలుఁగొందె భవవాతరణి యగుచు. 115

తే. మున్ను దా నపరాసక్తిఁ జన్న ఖిన్న
యగుచుఁ బద్మిని నెమ్మోము మొగిచె నంచుఁ
దరణి యచ్చేడియకు నంపుధాతపటము
లనఁగ నంచలు గొలఁకుల కప్పుడు డిగియె. 116

క. తమ్మికొలంకులపై జుం, జు మ్మని తుమ్మెదలు మొఱయుచొ ప్పలరె సరో
జమ్ములు మీఁదొరవచ్చెన్, లె మ్మని మేల్కొలుపుచున్న లీల దలిర్పన్. 117

క. తమి యెల్లఁ ర్చి తమప్రియ, తముఁ డగుగా జస్తమింపఁ దఱిఁ గని వచ్చెం
దిమురున్నఁ జండప్రభుఁ డని, కుముదంబులు మోము మోడ్చి కుముదము లయ్యెన్.

తే. చక్రములు పొంగె దస్యుసంచయ మడంగెఁ
దమము చెంగె జప్రతానము చెలంగె
సరసులం దెల్ల మలాలిశయ మెసంగె
జగము విం దగునినుఁడు తేజమునఁ బ్రబల. 1

. అప్పుడు సురకామినులు సమయోచితవిధులు, దీర్చి మణిభూషణాంబరదివ గం
దివ మాల్యాకంబులఁ దేజరిలుచు, సరవి నక్కన్యఁ దోడ్కొని సరగ న .

తే. తమరు దొలునాఁడు మెలఁగిన తావు చేరి, యచట భిన్నవగానవిద్యావినో
లీల న రాయచుండి రంబ్బాల నె ను, నిలిపి వలవంత గుందుచు నృపతి య

తే. కష్టతరముగ రేయెఁ • గడపి మఱియుఁ, దత్తరింపుచు వేఁగువ • తఱిని లేచి
యాచిగురుటాకుఁబోఁడి సో•యగము దప్ప,తక్కనమనంబున ని ట్లని • తలఁపఁ దొడఁగె.

మ. స్మరియింతున్ స్తనమండలేశ రవిరా•జత్ప్రాజ్యరాజ్యేందిరన్
హరిణాక్షిన్ హరినీలనీలచికురన్ • హర్యక్షమధ్య న్మనో
హరకాంతస్వరవిగ్రహన్ భుజగరో•మాళిన్ సముద్యత్సుధా
కరబింబప్రతిమానచారుముఖి స•ద్గంధర్వరాట్కన్యకన్. 123

చ. వలగొని బోటికత్తె లిరు•వంకల డాసి భజింప నింపుగా
జిలిబిలిపాట పాడు నెడఁ • జేతిక డానిపసిండివీణె కా
యలబలుతాపురం బొదలి • యాడెడునక్కలకంఠకంఠి ను
న్నలుకుమిటారిగబ్బిచను•గుబ్బలసోఁకెద నెంతు నెంతయున్. 124

చ. అఱమఱ లేక నేఁ దఱిసి • యాడ వసించినఁ జూచి నానతో
బిఱబిఱ లేచి హేమమణి•పీఠము డిగ్గి కురంగటన్ హొయల్
మెఱయ నొకింత కన్మొగిచి • మిన్నక యున్న పొలంతిమిన్నవా
ల్చుఱుకుఁబిసాళిక్రొందళుకుఁ•జూపులకోపు మదిం దలంచెదన్. 125

చ. పస యొసఁగం బొసంగుచును•బంగరుబొమ్మ తెఱంగునన్ దరిన్
వెసఁ గనఁబడ్డ నే వలచి • వేమరు నామరుఁ డేఁపఁ దద్దయున్
బిసరుహసాయకక్రియకు • వేఁడిన మో మఱ వంచి లోననే
ముసిముసినవ్వు నవ్వుకొను•ము పలగుమ్మహొయ ల్గణించెదన్. 126

క. వలఁతితనం బెలయఁగ నా, చె కానికి నుత్తరంబు • చెప్పుచు ముద్దుల్
చిలికెడునప్పొలఁతుకనును, జిలిబిలిపలుకుల హొరంగు • చింతింతు మదిన్. 127

క. తలవంచి పసిఁడిగద్దియ, కెలనన్ నాపలుకు లాల•కింపఁగ ముంజే
చిలుకఁ బలికించి కులికెడు, తలిరాకుంబోఁడివగలు • తలఁపున నెంతున్. 128

ఉ. అగణితలీల తా ల్లగఁగు•నట్లుగఁ జెట్లిగిరించునట్లుగా
మృగఖగపన్నగాదు లెల•మి న్విని చొక్కఁ బసిండివీణె బా
గుగ సుతి గూర్చి యామనిని • గోయిల గొం నభంగిఁ బాడునా
సొగసులదొంతియబ్బురపు•శోభనగానవిధాన మెన్నెదన్. 129

చ. చెలిమి వెలందు లిమ్మనకుఁ • జెచ్చెరఁ దోడ్కొనిపోవుమన్న చో
గొలగొలలాడుచు న్వెనుకఁ • గోకిలకీరమయూరశారికల్
బిలబిల నేగ వాని నద•లించు నెపంబున నన్నుఁ గూర్మితో

గడిగి మధుపర్కము లొసంగి • కన్యఁ దెచ్చి, రమణ నిర్వ్యాగసను గంకణములు గట్టి.

క. ఉడువీథిఁ జూచి యాజకు, లడరఁగ సుముహూర్తవేళ • యయ్యె నటంచున్
గుడజీరకములు శిరమున, నిడి కన్నియఁ జూపి రామ•హీదేవునకున్. 196

క. మునుకొని విప్రోత్తము లె, ల్లను గము లై పలికి రపుడు • లక్ష్మీనారా
యణ సావధాన యనుచుం, దనరఁగ సుముహూర్తసావ•ధాన యటంచున్. 197

మ. ఘనగంభీరవిరావసంకలితు లై • క్ష్మాదేవతాముఖ్యు లె
ల్లను మోదంబున నవ్వధూవరులనో•లం గూటువ లూడి డా
కొని “సర్వే మునయ స్సురాగ్రహాయుతాః • కుర్వంతు వా మ్మంగళ”
మ్మని లగ్నాష్టకము ల్పఠించిరి శుభో•దంచత్ప్రకారంబునన్. 198

క. కల్యాణపాత్రికల సా, కల్యముగ నివాళు లునిచి • గరితలు గౌరీ
కలాణంబులు వాడిరి, కల్యాంచితమాధురీప్ర•కాశము వెలయన్. 199

ఉ. పల్ల పాటలాధరశు•భ్రప్రభ లొప్పఁగ మేల్పయంటలన్
బెల్లుగ గుబ్బచన్గవలు • పెంపెసలారఁ గడింది వేడుకల్
మొల్లము మీఱఁ గ్రొత్తతెలి•ముత్తియపుంగ్రతసంపు సేసఁబ్రాల్
చల్లుచుఁ బేరటాండ్రు ధవ•ళంబులు వాడిరి కొందఱయ్యెడన్. 200

శా. ఆరాజన్యకుమారికంఠమున గో•త్రాదిత్యవర్యుండు సొం
పార న్మంగళసూత్ర మప్పుడు నితాం•తామోది యై కట్టి వి
స్తారోత్కంఠత నాగమోక్తికము వాం•ఛాప్రౌఢి మీఱన్ “ధ్రువం
తే రాజా వరుణోధు వ” మ్మనుచు ధా•త్రీనిర్జరు ల్వల్కఁగన్. 201

క. లలనాలలామశిరమున వలనుగ భూసురవరుండు • వసుధామరు నౌ
దలఁ గలకంఠియు ముత్యపుఁ, దలఁబ్రా ల్వోసిరి ముదంబు • దళుకొత్తంగన్. 202

తే. అంతరిక్షంబునం దిల • నఖిలజనులు, సారిసతోడ నరుంధతిఁ • జూచుచుంద
రప్పు డచటనె చెలఁగి జా•యాపతుల క, రుంధతిని జూపి రొజ్జయల్ • రూఢి మీఱ.

వ. మఱియు నగ్నిప్రతిష్ఠాపనాదివిధు లాగమోక్తప్రకారంబునం గావింపుచుఁ గ్రమం
బునఁ జనఁ బంచవాసరంబులు గడపి యున్న యాదంపతుల దీవించి యగస్త్యాదిమ
హర్షులు యథాస్థానంబులకుం జని రంత. 204

క. అతిభోగభాగ్యమహిమా, న్వితు లై యతిథులను నిచ్చ•నిచ్చలు గరుణా
మతిఁ బ్రోచుచు నద్దంపతు, లతులప్రాభవనిరూఢి • నలరిరి ధాత్రిన్. 205

క. అని కమలజుఁడు ఋతుధ్వజ, జనపాలకుచరిత దివిజ•సంయమి కెలమిన్

వినిపించిన విని యాతఁడు, మనమున నత్యంతహర్షమగ్నుం డయ్యెన్. 206

సీ. రహి మీఱ బ్రహ్మపురాణోక్త మగుచు గో, దావరీఖండంబు దనరు నందు
పృథివీస్రవంతీసరిత్పతీసంగమ, మాహాత్మ్య మెపుడు సీన హిమ నదియె
రసికజనమనోభిరామం బనెడుపేరఁ, దెనుఁగున శాలివాహ శకా
ములఁ గరిగిరిరసభూసంఖ్యఁ దద్దయు, వఱలుప్రమోదూతవత్సరమున

తే. నీప్రబంధంబు రచియించి నీకొసఁగితి, నిందుశేఖర నీకృప నిది ధరిత్రి
నాసుధాకరతారార్కమగుచుఁ గవిజ, నోత్తములయిండ్ల నేపారిద్దునుండుఁ గాత.

చ. పరమకృపాలవాల నిజభక్తజనావనశీల శత్రుభీ
కరఖరశూల భావభవగగ నివారణమూల శోభనా
కరగుణజాల భవ్యతరగం గజాజినచేల తాపసో
త్కరనుతిలోల నిర్మథితకాల నిశాముఖలాస్యఖేలనా. 208

క. పవనాశన హారబుగో, పవనావళినవవసంత ప్రథితమహీభృ
ద్భవనా భవనాళీకో, ద్భవనానాక్రతుభుగవన పరివృతభువనా. 209

మాలి. శరనిధివరతూణా సత్యవాక్యప్రమాణా
పరిహృతసుమబాణా పంకజాతాక్షబాణా
పరికలితకృపాణా భక్తరక్షాధురీణా
పరవృషజుహురాణా పాణిపద్మాంచదేణా. 20

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్యపుత్త్రి సకలసంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామతిమ్మకవిసార్వభౌమప్రణీతంబైనరసికజనమనోభిరామం బనుశృంగారరసప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

శ్రీకామేశ్వరీపరదేవతార్పణ మస్తు.

